Reg. No. 757

# అభినవసరస్వతి



సారస్వత మాసపత్రిక

జా. పా. పట్టాభిరామశాస్త్రిచేఁ

ప్రచురింపఁబడుచున్నది.

జా న పా డు.

సంపుటము 17 — 1920 సం॥ మార్చి నెల — సంచిక 12

విషయములు.



చందానిర్ణయము సంవత్సరమునకు

ప్రధానపోషకులకు రు 25 0 0 సహాయులకు రు 5 0 0

పోషకులకు రు 10 0 0 చందాదారులకు 3 0 0

Printed at the Chandrika Press, Guntur,
and published at Janapadu by the Editor, Astavadhani
Janapati Pattabhirama Sastry

## ప్రధానపోషకులు.

౧ శ్రీ శ్రీ జగద్గురు విరూపాక్ష స్వాములవారు, వెనికేపల్లి.
౨ శ్రీ శ్రీ జగద్గురు పుష్పగిరి స్వాములవారు, వైకుంఠపురం.
౩ బాకరాజు పరాంకుశరావుదేశాయిగారు. యాడవరం.
౪ రామశింగుగారు- నెల్లుట్లపాపురసంస్థానముల మేనేజరు- నెల్లుట్ల.

## పోషకులు.

౧ శ్రీ శ్రీ జగద్గురు అభినవ విరూపాక్ష పీఠాధిపతులు.
౨ ఎనమండ్ర లక్ష్మీనరసింహముగారు, మర్చెంటు, బెజవాడ.
౩ రాజా వెంకటాద్ర్యప్పారావు, బహదరుగారు, వుయ్యూరుయెస్టేటు.
౪ రాజామంత్రిప్రగడ వెంకటహనుమంతరావు, రాఘవరావుగార్లు, లింగగిరి.
౫ తంగెడ నరసింహారావుగారు, కరణం, మోర్జంపాడు.
౬ శ్రీరామయాంబికా పుస్తకభాండాగారము, లక్ష్మీనర్సాపురము.
౭ లింగాల వెంకటరెడ్డి దేశముఖుగారు, కుందవరము
౮ చారబుడ్డి రత్నారెడ్డిపటేలుగారు, న్యాలపోగుల
౯ లింగాల సీతారామరెడ్డి బండారెడ్డి, దేశముఖుగార్లు- నారాయణపురము
౧౦ టి. లక్ష్మణసింగుగారు, జొనగాం
౧౧ నెల్లుట్ల నరసింహారావుగారు, జొనగాం
౧౨ రంగాచార్యులుగారు, ముక్తాయారు, దేశముఖు, మసీదుపల్లె.
౧౩ చేకులపల్లి కృష్ణారెడ్డిగారు, కేశవాపురము.
౧౪ బాగన్లమూడి కుప్పుస్వామినాయఁడుగారు, కారంచేడు
౧౫ పిలుపాటి వెంకటరాయశర్మగారు, కరవది
౧౬ శ్యామాపంతుల వెంకటేశ్వరరావుగారు, తహశీల్దారు, సిరిసిల్ల.
౧౭ గూడూరి వీరసాంబశివరావు సర్దేశపాండ్యాగారు, మానుకొండూరు
౧౮ పొట్లపల్లి జగన్నాధరావు దేశముఖుగారు, అశ్వారావుపల్లె

---

## సహాయులు

౧ వావిళ్ళ వెంకటేశ్వరశాస్త్రిగారు, చెన్నపట్టణము.
౨ బుడంపాటి సుబ్బయ్యగారు, మర్చెంట్, కాకినాడ
౩ సంగెం రామారావుగారు, సంగెం
౪ పెద్దిభట్ల వీరయ్యగారు, ప్లీడరు బెజవాడ
౫ నెల్లుట్ల కేశవరావు దేశముఖుగారు, నెల్లుట్ల
౬ రంగావఝ్ఝల రంగయ్యగారు, నర్సారావుపేట
౭ నారాయణరావుగారు, దాతారుపల్లె
౮ వేలూరి రామన్నగుప్తగారు, సదాశివుంపేట

# అభినవ సరస్వతి

సంపుటము ౧౭ { జానపాదు. క్రోధన సం॥ ఫాల్గునమాసము. } సంచిక ౧౨

## కోటప్పకొండతిరునాళ్ల

ఈ కోటప్పకొండ త్రికూటాద్రి యను నామాంతరముగల యొక పుణ్యక్షేత్రము. దీని నెటుచూచినను ౩ కూటములు కనఁబడును. అందువలననే యీపేరు వచ్చియుండఁ బోలును. ఇయ్యది యాంధ్రదేశమునఁ గృష్ణానదికి దక్షిణముగా రమారమి ౪౦ మైళ్ళ దూరమునందు గుంటూరు మండలములోని నర్సారావుపేటకు మూఁడు క్రోసుల దూరములో నెల్లమఁదకును గొండకావూరునకును నడుమనుండు నొక పర్వతము. దీని చుట్టుకొలత యించుమించు మూఁడు క్రోసులుండును. వైశాల్యము కొంచె మెచ్చుతగ్గుగా ౧౫౦౦ ల యెకరములని తెలియవచ్చెడిని. ఎత్తు ౧౫౮౭ అడుగులు. ఇందు ౬౦౦ అడుగులయెత్తునఁ గోటీశ్వరుని గుడికలదు. ఆగుడికిఁబోవు మెట్లకు మొదట బొచ్చు మల్లయ్య గుడి యుండెడి. ఇచ్చట మ్రొక్కుకొన్నవారు శివరాత్రిదినములలో శిరోజముల స్వామికర్పించుచుందురు. ఇందుమూలమునఁ బ్రజ లర్పించు కానుకలు సుమారు ౨౦ రూపాయలయ్యెడిని. సోపానమార్గమున గొల్లభామ గుడి కలదు. జనులు ముందు గొల్లభామను దర్శించి కాని కోటీశ్వరుని దర్శింపరు. కోటీశ్వరుని గుడికి సమీపమున నిర్మలోదకపూరితములై ౪ దొనలు కనుపట్టెను. సోపానమార్గమున కెడమభాగమునఁగల శిఖరమునకుఁ గ్రిందుగాఁ బాపవినాశనమను మఱియొక క్షేత్రము గలదు. ఇందొక చిన్నగుడిలోఁ బాపవినాశనమను లింగమును దత్సమీపమున నొక దొనయును జూపట్టెడిని. ఈత్రికూటాద్రిపై నించుమించు ౧౫౦ సంవత్సరములనుండి శివరాత్రికి గొప్పయుత్సవము జరుగుచున్నది. ప్రజలు బహుభక్తితోవచ్చి స్నాతులై స్వామిని సేవించుచుందురు. ఆపత్సమయములందు మ్రొక్కుకొనువారును దదితరులును వేలకొలఁదిఁ బ్రభలు కట్టుకొనివచ్చి తీర్థమాడి తడిగుడ్డలతోడనే సాధ్యమగువానిని భుజములపైఁబెట్టుకొని కొండయెక్కి స్వామికి మూఁడు ప్రదక్షిణములు చేయుచుందురు. సకుటుంబముగాను నొంటరిగాను పలుకు వలగొనివత్తురు. పశువులచేఁగూడఁ బ్రదక్షిణము చేయింతురు. పెక్కుగ్రామములనుండి గ్రామప్రభలని గొప్ప ప్రభలఁగట్టుకొని వత్తురు. అవి నలుబదేసిమూరలు కూడ నుండును. ఈయుత్సవము మాఘ శివరాత్రికి జరుగును. ఈమహోత్సవమున కరుదెంచు నరులు కొంచెమెచ్చుతగ్గుగా నొక లక్ష యుండవచ్చును. వేలకొలఁది వర్తకులు

దుకాణములు పెట్టి బహుమూల్యములగు వస్తువాహనములును గృహనిర్మాణయోగ్యసామగ్రులును విక్రయింతురు.

ఆంధ్రదేశమున జరుగు నుత్సవములకెల్ల నిది కడుంబ్రసిద్ధమైనది. ఇచ్చటికి వచ్చినంతజన మెచ్చటికిని వచ్చుట గనుపట్టదు. ఇది మహాస్థలమైనను నింతజనాగమనము లేకయే యుండుచుండ నర్సారావుపేట తాలూకాలోని యేల్చూరు కాఁపురముగా నుండిన పినపాటి యేలేశ్వరయ్యగారికి నగముపై నిరశనంబుగాఁ దపంబుండి జనాకర్షకయంత్రస్థాపన చేసినట్లును దదాది శ్రీశైలాదిక్షేత్రములకుంబోలె జనులిచ్చోటికి వేనవేలరుదెంచుచున్నట్లును నొక ధర్మశాసనమువలనఁ దెలియనయ్యెడిని. ఏతత్త్రికూటాద్రివర్తియగు తత్కోటీశ్వరుఁ బ్రతిష్ఠించినవారుగూడఁ దత్పూర్వులేయైయుండిన ట్లాశాసనమువలనఁ దెలియవచ్చెడిని. అందువలననే యాయన కింతశ్రద్ధ గలిగియుండఁబోలును. ఈపినపాటివారు మొదటినుండియు వైదికతాంత్రికవిదులును మహాశైవశాంభవీదీక్షాపరులును మంత్రోపాసకులును నేకలింగపూజానిష్ఠాగరిష్ఠులును నయియున్నవారు.

బెల్లముకొండ సీమకుఁజేరినవై పల్నాడు సత్తెనపల్లి వినుకొండ నర్సారావుపేట తాలూకాలలోని కొన్నియూళ్లు కొంతకాలముక్రింద నర్సారావుపేట జమీందారులగు మల్రాజువారి యేలుబడిలో నుండుచుండెడిని. అందువలననే యీత్రికూటాచలముపైఁ జేయఁబడిన కోటీశ్వరప్రతిష్ఠ స్వవంశ్యకర్తృకమైనను ధర్మకర్తృత్వము తమయందే యుంచుట కీజమీందారులఁ బినపాటి యేలేశ్వరయ్యగారు ప్రార్థింపవలసివచ్చినది. అట్లు ప్రార్థించి పడసినను నచిరకాలముననే యయ్యధికారము దొరతనమువారిచే మరల నర్సారావుపేట జమీందారులపైఁ బెట్టబడినదఁట. అందువలననే ప్రకృత మెవరెన్ని ప్రయత్నములుచేసియు వీరి ధర్మకర్తృత్వమునకు భంగముగలిగింప లేకయున్నవారు.

నర్సారావుపేట గ్రామనివాసులగు రామడుగు రామకృష్ణశాస్త్రిగారీఁ జమీందారుల కాశ్రితులు నాస్థానపండితులు. నే నాశాస్త్రులవారియొద్ద నిప్పటికి ౩౦ సంవత్సరములనాఁడు కావ్యములు చదువుకొనుచు వారితోపా టీతిరునాళ్లకుఁబోయి పలుమాఱులు కోటీశ్వరుని గర్భాలయమునఁ బ్రవేశించి యభిషేకముచేయుచును దదుత్సవవైఖరియంతయుఁ దిలకించుచును నుండెడివాఁడను. ఆతరువాతఁగూడ నప్పుడప్పు డాయాత్ర చేయుచువచ్చితిని గాని ౨౦ సంవత్సరములనుండి బొత్తిగాఁ బోయియెఱుంగను. ఈయుత్సవమున కాకొండక్రింద వేనవేలప్రజలకు శివరాత్రినాఁడు ఫలాహారములు పెట్టుచును మఱునాఁ డన్నదానముఁజేయుచును జీవితాంతముఁ దనచైదమంతయు నందులకై వినియోగించిన గబ్బిట కోటయ్యగారును వారు స్వర్గస్థులైన తరువాతఁ దత్కార్యభరమంతయు నొదలవహించుచున్న తత్సోదరులు కృష్ణయ్యగారును నెన్నియో

పర్యాయము లచ్చోటి కరుదెంచుమని యాహ్వానించుచున్నను బెద్ద ప్రభగట్టుకొని మహోత్సవముతో మాయూరిజనులు నూఱులకొలంది యేగుచున్నను నిన్ని వత్సరములనుండియుఁ దదుత్సవ సందర్శనము నాకుఁ దటస్థింపదు. మాఘ శు ౧౧ మొదలుకొని వేదవరములో మామామగారగు సోమయాజుల అప్పయ్యగారిచే నొనర్పఁబడిన సప్తాహమునకుఁ జేరినబంధుగులు కొందఱును నాయర్థాంగియుఁ బ్రేరేప నప్పటినుండియు శివరాత్రి యమరావతిలోనో. కోటప్పకొండకడనో వెళ్లింప సంకల్పించి నడుమఁ గొన్ని యంతరాయములు దోఁచినను దుదకుఁ గోటీశ్వరుని సందర్శింపఁగలిగితిని. మాగ్రామీణుల వేడికోలుపై మాఘ బ ౧౧ నాఁడు రాత్రి గ్రామప్రభతోడనే బయలు వెడలవలసిన వాఁడనయ్యు స్త్రీజనము తత్సంబాధమున కాఁగఁజాలమిని మఱునాఁ డుదయమునఁ గాలినడకనే పిడుగురాళ్లవఱకు నేగి విచారింపఁగా గుఱ్ఱపుబండ్లుకాని మోటారులు కాని దొరకుట దుర్ఘటమయ్యెను.

మోటారుల కాశించినవారు యాత్రికబాహుళ్యమున స్థలముదొరకక మూఁడు దినములనుండి యచ్చటఁ బడియుండిరి. గుఱ్ఱపుబండ్లచార్జీ యిబ్బడిముబ్బడి పెరిఁగి పోయెను. అదృష్టవశమున నేదియో యొకగుఱ్ఱపుబండిదొరక దానిపైఁబడితిమి. కాని యాబండివాఁ డొకరిమీఁదనొకరి నొకడజనుమంది నందులోఁ ద్రోసెను.

కల్లుద్రావినవారియొక్కయు జద్దిమూటలవారియొక్కయు మధ్యభాగ మాడువాండ్రకును బండివాని వెనుక భాగము నాకును నిరవుగా మహాసంబాధముతో నెట్లో కూరుచుండి యొంటిగంటకుఁ గనులఁబ్రాణములువెట్టుకొని నర్సారావుపేటకుఁ జేరుటయు నీతిరునాళ్ల ప్రజలకొఱకే సాగింపఁబడు రాచకొండ కొండయ్యగారిసత్రమున విస్తళ్లువేసి వడ్డించుచు నయిదునిముసము లాఁగియుండెదము వేగ స్నానముచేసిరండని తొందరించిరి. అయిదునిముసముల కరగంటకూడ నయ్యెనుగాని నా స్నానము సంధ్య దేవతార్చనము నగుపర్యంతము వేచియుండిరి. ఆనాఁడు ప్రొద్దుటినుండిపడిన యాయాసమును దత్సత్రములోని సౌఖ్యము పోఁగొట్టఁజాలెను. మృష్టాన్నము, ఆజ్యప్రవాహము, తిన్నన్ని పూరణపు బూరెలు, త్రావినంత పెరుగు. వీనికేమి, బ్రాహ్మణులకుఁ దఱచుగా దొరకెడివే. కాని భోజనము చేయునంత కాలము దేవునకుంబోలెఁ బ్రతివ్యక్తికిని మంగళహారతులు. వీచోపులు. భుజించువారికిఁ గబళకబళమునకును గోవిందలుకొట్టుట కష్టమయ్యెఁగాని కృష్ణలీలాతరంగములు పాటలు పద్యములు చదువు తద్భక్తులుమాత్ర మించుకంతయుఁ గష్టమని యనుకొనరైరి. ఎవరాభక్తులు? కొండయ్యదాసుగారు కూశ్మా దాసుగారు గొల్లపూడి రామమూర్తిగారు మున్నగు మహామహులు. అట్లు భుజించి యాసాయము నరుదెంచు నాప్రభలను నాబండ్లను నాజనులను నవలోకించుచును మేళ

ములు తాళములు శ్రవణించుచును నయ్యహమెల్ల నందేయుండి మాయూరినుండివచ్చెడి పెద్దప్రభకొఱకు నిరీక్షించుచుంటిమి. అది యెవ్వియో యిడుములవలన నా రాత్రి రెల్లను రాక శివరాత్రినాఁడు సూర్యోదయమునకు కచటికి కేతెంచుటయు నప్పటికే మా స్నానసంధ్యాది కాల్యకృత్యములు దీర్చుకొని దానిని సమీపింప నా ప్రభనుగట్టించిన సంఘమున కగ్రగణ్యుఁడు చప్పున బండిపైనుండి దిగి మమ్ము సగౌరవముగా నం దధిరోహింపించెను. అట్లు దానిమీఁదఁ గూర్చుండి రెండు జాములకుఁ గాని కొండకడకుఁ బోలేకపోయితిమి. ఉత్తమనుష్యులకే సరిగాసాఁగని దారి పెద్దప్రభబండి కెట్లుసాఁగఁ గలదు.

లెక్కకుమిక్కిలియై గుంపులుగుంపులుగానున్న పాదచారులును స్త్రీపురుష విశిష్టములై యెడములేకుండనడచు బండ్లును బగ్గములుపట్టువారు గడ్డపాఱలు గాళ్లక్రింద వేయువారు మున్నగు నాఱులపరిజనముతోఁగూడిన గ్రామ ప్రభలును జనులను సామానులను గొండవద్ద దించి యెదురునడచు శూన్యశకటములును గలిగి మార్గము కడుసంబాధమై యొకవిధమైన నేత్రానందము గలిగించెను. ఆచరిత్రావగాహులై యాసనంబునిండ బూదియులఁది యంగవస్త్రములఁగట్టిన దేవునిపెట్టెలు భుజముల వ్రేలాడఁ బరువులెత్తు వైదిక బ్రాహ్మణులను గాశీలుత్రావి క్రాపింగులు దువ్వి పెళపెళలాడు నిస్త్రీవస్త్రములు ధరించి తిలకశూన్యలలాటంబులం దేజరిలు నవనాగరికులను జెంపలు విఱుగదువ్వి సంపంగినూనె వాసనలతో సర్వభూషణభూషితాంగులై సమవయస్కులగు స్త్రీపురుషులతోడ సరసంబులాడుచుఁ జనుదెంచు నూత్న యువతులను నలక్ష్యభావముచే నాత్మీయులైన పుత్రమిత్రాదులు తమ్ము వెనుకఁబడవైచిపోవ మాటలు మోయఁజాలక ముక్కుచును మూలుగుచును నడుగులో నడుగిడి నడచు ముదుసళ్లను నల్లనియొడళ్లకుఁ దెల్లని దుస్తులచే నొకవిధమైన యలంకృతిరా సమయమిదేయని చతుర్వర్ణజనులను సంస్పృశించుచుంజను క్రైస్తవులను రంగురంగుల లంగాలచెఱంగులు నేల జీరాడ జాఱుజడలు పిఱుఁదుల వఱకును వ్రేలాడఁ గుంకుమరహితములైనను వంకపాపటలు పలకబాస్యముల నగసేయ నొకరిపైనొకరు పడుచు నొయ్యారంబుగావచ్చు పంచమకన్యలను నొకరిమీఁద నొకరుగా నవ్వుచును దుళ్ళుచును గలకలంబొనరించుచు లోపలఁ బట్టకుండనుండు జనులతోడి సవారిబండ్లను సామాన్యమైన పామరదృష్టితో వీక్షించిన నేత్రానంద మేల కలుగకుండెడిని! అట్లు పోవఁబోవ నెల్లనుంద యేగుదెంచెను. మేళగాండ్రు ముందు నడువచ్చిరి. వాద్యసాధనములమీఁది గవిసెనలుతీసిరి. విద్యాపాటవముఁ జూపమొదలిడిరి. గాతలకును శ్రోతలకును నెంతసేపటికిని దనివిదీఱదయ్యె. ఎండయెక్కినకొలఁది శ్రోతలకుఁ దీఱెనుగాని గాతలు కదలనీయరు. మద్యశాల మార్గమందేయుండెను. చలిపంది

రులలోనున్నంత జనము సురపందిటను గనఁబడియె. బజంత్రీలు ప్రభబండి నరికట్టి తత్సం ఘనాయకుని మెప్పొంద యత్నించిరి. భూషించిరి. బొజ్జదువ్విరి. మద్యశాలకులాగిరి. మాకు మార్గముదొరకెను. ప్రభను నడిపించితిమి. కొండ సమీపించితిమి.

గుండులకును బండలకును వెదకసాగితిమి. చిన్నరాయియుం జిక్కదయ్యెను. ఎట్లుచిక్కును ? ఒక్కొక్క రొక్కొక్కరాయిచొప్పునఁ గొండదరిగి కోటీశ్వరు గుడికేగుమార్గమున నొకచో నేయవలెనఁట. అచ్చట నొక పెద్దగుట్ట పెరఁగినది. రాను రాను గోటయ్యకొండంత యింకొకకొండగూడ నగునుగాఁబోలును. వీనికిఁ బ్రమాణ మేమి ? నేలమువెట్టి. ఏవెట్టియైననేమి ? ఇందఱమును నేపాటులోఁబడి యెక్కడనో సాధించి చేతి కొక్కరాయి సేకరించి గుట్టపై వైచితిమి. స్నానముచేసి తడిబట్టల తోడనే బ్రహ్మముళ్లు వైచికొని కోడెలతోడను దూడలతోడను పలమూఁడుక్రోసులును నలగొనివచ్చి శిలాభరంబున శిరములుఁ గ్రుంగఁ గోటయ్యా ! కాదుకో యని దంపతులు తండోపతండములుగాఁ గొండతాళ్లన్నియు గుట్టపై వేయమొదలిడిరి. ఏమా యుత్సాహము, ఏమాభక్తి! పడుచుపడుచువారందఱును బైని బండలు పెట్టుకొని బ్రహ్మముళ్ల బంధింపఁబడిన పడఁతుల లాగుకొనుచుఁ బరువులెత్తఁ బడుచువారలైనను సబలలగుటచే వారు పడుచును లేచుచును భర్తల వెన్నంటుటఁజూచి బళిరే యనుకొంటిని. మూఢ భక్తియో, గూఢభక్తియో, యేదియో యొకటి రూఢమై నరలోకమును దరింపఁజేయఁ జాలెడిని. శ్లో॥ యాదృశీ భావనా యత్ర సిద్ధిర్భవతి తాదృశీ॥

సీ॥ అర్థశూన్యాక్షరం బగుఁగాక యయ్యది మంత్రమంచు జపింపఁ గాంత్రు సిద్ధి,
యపవిత్రపుం గుంటయగుఁగాక యయ్యది తీర్థమం చటఁ గ్రుంకఁ దీఱు నఘము,
మిగులఁ దుష్టాత్ముఁ డగుఁగాక యాతండు బ్రాహ్మణుండని మ్రొక్కఁ బడయుశుద్ధి
పగులఁగొట్టిన రాయియగుఁగాక యయ్యది దేవుఁడంచని వేఁడఁ దీర్చుఁ గోర్కె
జోస్యుఁడసమర్థుఁ బ్రశ్నంబు సూటిపడదు, నౌషధంబని భక్షింప నడఁగుఁ దెగులు
గురువటంచును సేవింప గుణముగలుగు, నెట నెటుల భావనముసేయు నటులసిద్ధి

(స్కాందమహాపురాణాంతర్గత నాగరఖండము [illegible] అ॥ [illegible])

శ్రుతిస్మృతి పురాణాదుల కపార్థముఁ జెప్పియో ప్రక్షిప్తములనియో హేతువాదములు చేయుటయు వేఱుపన్ని వెక్కిరించుచు యథేచ్ఛమై వర్తించుటయు నింద్యములు కాని మూఢమైనను రూఢమైనచో భక్తి నింద్యము కాదు. పలువు రీభక్తివలననే తరించిరి. కాని యీమూఢభక్తియైనను నేత ద్యాత్రికుల కుండుటను గలదని నేను జెప్పఁ జాలను.

లక్షలప్రజ వచ్చుఁగావున వీక్షించివత్తమని సవిలాసముగాఁ జనుదెంచువారు

కొందఱు, వలసినన్ని వస్తువాహనము లమ్మఁబడునుగావునఁ గొనితెచ్చుకొందమని కూడి వచ్చువారు కొందఱు, వస్తువుల విక్రయింపవచ్చువారు కొందఱు, తీరుతీరు వారిజాస్య లయదెంతురుకావున వారి చీరచెఱఁగులచేతనైనను గారవింపఁబడఁగోరి యేతెరువారు కొందఱు, ఇచ్చవచ్చినట్లు విహరింప నిండ్లలోపల వీలుపడమిని స్నేహము గలసినవారి తోడఁ జెట్టాపట్టాలు పట్టుకొని తిరుగవచ్చువారు కొందఱు, వలసినంత పప్పుబెల్లము తిని కలసినంత సేలఁ జెఱుపవచ్చువారు కొందఱు, సంకల్పములు చెప్పియు నభిషేకములు చేయించియు నీరుకాసులుపట్టియు గరుడకంబములు దాల్చియు భజనలు గావించియుఁ బ్రాధేయపడియు ఱొమ్ములఁ గుఱిపటులు పెట్టుకొనియుఁ దలలు వ్రూడ్చుకొనియు, ముండ్ల పైఁ బరుండియు యాత్రికుల చేతులు విఱిచియుఁ గాళ్లు త్రొక్కియు మూతులువిప్పియు జేబులు కత్తిరించియు నాడువాండ్ర మెడలు సవరించియు న్యూసెన్సులు పట్టుకొనియు డబ్బులు కట్టియు సంపాదించుకొనవచ్చువారు కొందఱు. కాని పుణ్యక్షేత్రమనియు లింగరూపుఁడగు కోటీశ్వరున కభిషేకించియుఁ బూజించియుఁ బ్రదక్షిణించియు దర్శించియు నమస్కరించియు దేవబ్రాహ్మణ దీన బధిరాంధపంగ్వాదులకు యథాశక్తి విత్తమిచ్చియుఁ దరింతమను భక్తితోఁ బఱతెంచు ప్రజలుమాత్రము బహుస్వల్పము. అట్లు క్రమముగా మాప్రభబండి కోటయ్యగుడి కభిముఖముగా నడకదొడంగుటయు జనసంబాధముచే బెత్తెఁడుఁ గూడ ద్రోవసాఁగదయ్యెను. మందమందముగనైనను ముఁదటికిఁ జనకుండ నడుగడుగునను నొకరితరువాతనొకరు విశ్వబ్రాహ్మణులువచ్చి వీరంగములు త్రొక్క మొదలిడిరి. కాళ్ళకు గజ్జెలుకట్టుకొని లయదప్పకుండ నడుగిడుచు సన్నాయికాండ్రును డోలుకాండ్రును సరిరాయన భరతశాస్త్రప్రకారము ప్రకటాభినయములతో బాగుగా నృత్యమాడిరి. ఖడ్గములు వేయఁగడఁగిరి. భక్తులు పరవశులైపోయిరి. నాలుకలు చాపిరి. బుగ్గలు చూపిరి. నారసములు పొడిచికొనిరి. పోవు ప్రభలు పోవుచుండ వచ్చుప్రభలు వచ్చుచుండెను. ఎదురుతాఁకులు జరుగుచుండెను. యీమధ్యయమున కెట్లో కోటీశ్వరునకభిముఖముగా సోపానపంక్తి సమీపించితిమి. ప్రభ వెనుకకు మరలెను.

మేము ప్రభబండినుండి దిగితిమి. సత్రమునకుఁ జేర సంకల్పించితిమి. కాని యది యెక్కడనగుపడును? దిగ్భ్రమఁ జెందితిమి. త్రోవదొరకదయ్యెను. కనుచూపుమేర నంతయు జనారణ్యము. కొండమీఁదఁ గోటయ్య గుడికేగు జనము సోపానమార్గమునఁ జీమలబారువలె సూక్ష్మముగాఁ జూడఁబడియె. మేము నిలుచున్నచోటి కిరుప్రక్కలను దుకాణములు. ఆడువాండ్రదృష్టి యంగళ్లపై ప్రాలినది. కాని బంధుబాలికయోర్తె ప్రసాదమని పరితపింపఁ బ్రథమ మందుకై ప్రయత్నింపవలసె. శివరాత్రి కనుక గబ్బిట

వారిసత్రమునఁ గదళీఫలములు తప్పఁ గబళమేని యన్నము లభింపదు. అది శాస్త్రీయమే. తత్సత్రస్థాపకులగు కోటయ్యగారు శాస్త్రముననుసరించియే నాఁడు ఫలాహారమును నావలియీవలిదినము లన్నమును బెట్టనారంభించిరి. అట్లుగాక యన్నమే పెట్టసాఁగినఁ బిల్లలే కాదు పెద్దలును నందులకు సంసిద్ధము. ఎవ్వరో యొకరుగాని వీరందఱు శివరాత్రియనియు క్షేత్రమునకేగి యుపవసించి శివునిసేవించి జాగరణమొనర్తమనియు వచ్చినవారా? ఆసంగతియు నావలఁ దెలియనయ్యెడు. అంత నయ్యంభట్లగారి సత్రమున నన్నము పెట్టుదురని యాకర్ణింపఁబడుటయు నద్దాని నన్వేషించుచు నడుగనడుగఁ గన్యకాపరమేశ్వరీ సత్రమనియు జంగమువారి మఠమనియు ద్వారదేశములఁ బలకల మీఁది వ్రాఁతలతోఁ గొన్ని పందిళ్ళను బాకాలును గనఁబడియె. ఆహా! ఏమియన్నదానము. వేనవేల వైశ్యులు వెండిచెంబులతోడను బట్టుపుట్టములతోడను భుజింపఁబోవువారును భుజించివచ్చువారును గనుపట్టిరి. ఆచండాలముఁగలయునంత జనసంబాధమునఁగూడ నాచారమును వీడకుండుట యవ్వారి యార్యవైశ్యుల నన్వర్థముఁజేయుచుండెను. ఈసత్రములన్నియు దాఁటి దాఁటి యయ్యంభట్లగారి సత్రమున కరుగఁగలిగితిమి. అయ్యంభట్లగారిది తత్సమీపవర్తిగ్రామమగు గోవిందపురము. వీరు చాలకాలమునుండియు నన్నదానాదిక మాచరించి భూతతృప్తిఁజేయుచు ధర్మనిరతులైయున్నవారు. ప్రతివత్సరము నీకొండకువచ్చి యుపవసించి కోటీశ్వరున కభిషేకించి జాగరణమొనర్చి యేఁగుచుండెడివారు. చలిపందిరులు పెట్టి నీరును మజ్జిగయుఁ బోయుటకును సత్రములు వేసి ఫలాహారములును నన్నమును బెట్టుటకును యాజమాన్యమువహించిన పుణ్యపురుషులన్యులు కాని దేవునిగుడిలోనికిఁ బోనిచ్చుటకును నచటవైచిన కానుకలఁ దీసికొనుటకును యాజమాన్యమువహించినవారు నర్సారావుపేట జమీందారులు.

వా రాస్థానమున ధర్మకర్తలఁట. ధర్మంకరోతీతి ధర్మకర్తా. ధర్మము చేయువాఁడు ధర్మకర్త. ఈతిరునాళ్ళలోఁ గొండమీఁద రాజాపేటగ్రామనివాసులగు భాగి బ్రహ్మయ్యగారును నన్నదానము చేయుచున్నవారు. క్రింద గబ్బిటి కోటయ్యగారును గుడిపల్లి అయ్యంభట్లుగారును నర్సారావుపేట వైశ్యులును మఱికొందఱును నన్నోదకదానంబు లొనర్చుచున్నవారు. పందిళ్ళు వేయించియుఁ బాకాలు వేయించియుఁ గోనేళ్లు బాగుచేయించియుఁ జెలువులు బాగుచేయించియు నల్లరులు జరుగకుండ నాఫీసరుల నంపించియు దొరతనమువారు యాత్రికులకు సౌకర్యము కల్పించుచున్నారు. నర్సారావుపేటలో బ్రాహ్మణులకు రావకొండ కొండయ్యగారును వైశ్యులకు వైశ్యులును నవిచ్ఛిన్నముగా నన్నము వేయుచున్నారు. మఱియు ననేకు లనేకరీతుల నన్నోదకపరిగలయియో యన్నసాహాయ్యమొనరించియో యశము గడించుచు

న్నారు. కాని ధర్మకర్తృత్వము మాత్రము తద్రాజాగారియందే రూఢమైనది. ధర్మకర్త యనిన దేవాదాయమునఁ గూలిమాత్రమేని కుడువక యాలయగోపురప్రాకారాదినిర్మాణమునకో యన్యమునకో తదీయకైంకర్యమునకే ఖర్చుపెట్టువాఁడగును గాని యుత్సవకాలమునఁజేయఁదగు నుత్తమకార్యముల వ్యయమంతయు నొరులు భరింపఁ బడివేలో యయిదువేలో వచ్చినదంతయు తీసికొనిపోయి వడ్డీలకు వేయువారెట్లగుదురు ? కనుకనే ప్రకృతము ధర్మకర్తలన్న గౌరవమువీడి దేవద్రవ్యము హరించువారుగాఁ లెక్కింపఁబడుచున్నవారు.

తే॥ మంచిశబ్దమ్ము లన్నియో మంటఁగలిసి తనరులేని దురర్థమ్ములఁ దాల్చెనెల్ల
వానిధరియించు నొకకొన్ని వస్తువుల మహత్త్వమే కాని వేఱుగా దయాయమంబ ॥
( గుంటూరుసీమ పూర్వరంగము ౨౦౫ )

ఆధర్మకర్తలగు రాజాగారు కోటీశ్వరు నభిషేకముచేయువారివద్దఁ గొంతధనము తీసికొనుటకు నియమించిరి. అయ్యంభట్లుగారదియీకుండనే యభిషేకమున కరిగిరఁట. రాజాగారి సేవకులు రానీయరఁట. అదియునుంగాక యావిషయమున వారికిని వీరికిని గొంతకయ్యము జరిగియుండెనఁట.

అయ్యంభట్లుగారట్లు రాజాగారి సేవకులచే నవమానితులై యిఁకఁ దదాలయములోని కభిషేకమునకుఁ బోనని ప్రతినపట్టినట్లును చెనకేకాక తక్కుంగలవారికిని నుపయోగించుటకై కొండక్రింద శివప్రతిష్ఠఁజేసి గుడికట్టించినట్లును వినవచ్చెడిని. గబ్బిటవారిసత్రమునుంబోలె నింక రాతితోను సున్నముతోను నమర్పఁబడకున్నను దదాలయము పక్కనొకదూలపుమిద్దె వేసి సత్రమునకుఁగాఁ గొంతప్రదేశము చేర్పఁజేసెను. ప్రకృతమా స్థలముననే పందిళ్ళు వేయించి యన్నదానము సాఁగించుచున్నవారు. అట్టి సత్రమున కాబాలికం దోడ్కొనిపోవుదుముగువఱకు వైశాల్యము చాలమిఁ బట్టినంతవఱకు మూఁడు మాఱులు భుజించిపోయిరఁట. నాలవమాఱుగూడ నావరణమంతయు నిండి కూర్చుండి భుజించుచున్నవారు. ద్వారములకుఁ దడికె లడ్డము పెట్టఁబడియున్నవి. నెట్టుకొనిపోకుండ శాంతిసైనికులు కాపాడుచున్నారు. అన్నార్తులై యనేకు లవలఁబడియున్నారు. వారితోపాటు మేమును భుజించువారు లేమగుటకుఁ గూర్చుంటిమి. అయ్యంభట్లుగారి సత్రపుగోడ నవలిభాగపుఁ బంచటిలోఁ గూడఁ గొందఱికన్నము పెట్టుచుండిరి. అన్నార్తులు కొందఱందులోనికిఁ బోవుచుండ నస్మదీయబాలికం దోడ్కొని యట్లాంగి యందుఁ ప్రవేశించెను. పోనీ మ్మెక్కడనో యొక్కెడఁ బిల్ల భుజించిన వెళ్ళిపోవచ్చునని నేనును సంతసించితిని. విస్తళ్ళువైచి యన్నము వడ్డించిరి. కూర్చున్నవారు కలుపుట కారంభించిరి. కాని ముద్ద నోటఁబెట్టకముందే శివార్చకులు శివార్చకులన్న కలకలమొకటి

బయలు వెడలెను. పిల్లలదగ్గఱనుంచి విస్తళ్ళు వదలిపెట్టి లేచివచ్చిరి. ఇదియేమి యాగడము? మీరు శివార్చకులై యెట్లు మా కన్నము పెట్టితిరని పెద్దలు కొందఱు కొట్లాడిరి. మాబంధువులున్నగు కొందఱును మాయొద్దఁదినువారుగూడ నుండిరి. మీరును వారే యనుకొంటిమి. వచ్చి కూర్చున్న మీదితప్పు కాని మాకేమితప్పని వారు ప్రతిచెప్పిరి. అంతలో నూరకుండక యందఱు నవలకరిగినపిదప మెల్లగా నేమియో గొణఁగసాగిరి. ఆశబ్దములు మాకన్నను దక్కువవారియిండ్లనే మీవారు పలుమంది తినుచున్నారు. దానికంటెఁ జెడిపోయినదా యన్నట్లు నా కించుక వినవచ్చెను. అయ్యది సరియైన యుత్తరముగానే నాకుఁ గనుపడెను.

ఈతిరునాళ్ళలో నిన్ని సత్రములున్నను హోటళ్ళు లేకపోలేదు. అందుఁదినువారెవ్వరన్న నన్నిజాతులవారును. అన్నిజాతులవారును గలసి కుడువవచ్చునుగాని యర్చకులయన్నము దినుట తప్పా? వారును శివబ్రాహ్మణులే. తినువారు నానాజాతులవారైనను బెట్టువారు బ్రాహ్మణులేకదా యని యనినచో మన సహాయనిరాకరణవాదులా సందియమును దీర్చుచున్నారు. ఈతిరునాళ్ళలోని శాంతిసైనికులు నానాజాతులవారు గలసియే వంటచేయుట. నీళ్ళు తెచ్చువాఁడు బ్రాహ్మణుఁడు. అన్నము వండువాఁడు వైశ్యుఁడు. కలియఁబెట్టువాఁడు శూద్రుఁడు. వడ్డించువాఁ డొడ్డెయ. భుజించువాఁడు బోయ. ఏమి భేదమున్నది? సర్వము జగన్నాథము. వీనికన్నిటికిని గాకినాడ కాంగ్రెస్సే కాఁకలుతీర్చినది. శివార్చకుల యన్నము తినవచ్చునని కాదు నాయాశయము. ప్రకృతపు స్థితిగతు లిట్లున్నవని యేకరువుపెట్టితిని. ఈకథయగువఱకు నయ్యంభట్లగారి సత్రములో నాల్గవపంక్తికూడ లేచినది. ముద్దక్రింది మూటలుతీసికొని మూఁగుమూంగుగాఁ [illegible]త్తిరి. ఎంగిలిచేతులవారు లేఁగకపూర్వమే తినఁదలఁచినవారు చనుదెంచిరి. శాంతిసైనికులతో సమరమొనర్చిరి. తడికెలు విఱుఁగఁద్రొక్కిరి. ఏమిచేసిన నేమి? ఎంగిలి విస్తళ్లలో నెక్కడఁగూర్చుందురు? తేరకువచ్చినదని తినుటయుఁ జనుటయునే కాని యొక్కరుఁడైనను విస్తళ్ళుదీయుటకు వెన్నువంచినదా? ఆవిస్తళ్ళుతీయుటకును నాయెంగిళ్ళెత్తుటకును నాకూరగాయలు తఱుగుటకును నావడ్డించుటకును నాహరికీర్తనమొనర్చుటకును మల్లెపూడి గుంటూరు నర్సారావుపేట మున్నగు గ్రామములలోని సతులకుఁ దగిపోయినదికాని యూరికాకరుగా నేతెంచిన తిండిపోతుల కీభాగ్యమేల యబ్బెడిని. అంత నయ్యంభట్లగారి యనుంగులో యనుచరులో కొందఱులేచి స్థలశుద్ధి కారంభించిరి. వారును స్వల్పసంఖ్యాకులే యగుటంకలన నెంతసేపటికిని స్థలము శుద్ధము కాదయ్యె. అప్పు డశక్తులమయ్యు నందులకు శంకరమంచి లక్ష్మీనారాయణశాస్త్రియు నేనును బూరఁబడితిమి. కొంతసేపటి కట్లో స్థలశుద్ధియై కాకుండఁగనే గోళ్ళలమంద

వోలె నొక్కబిట్టిన బ్రాహ్మణులందఱును లోపలఁ బ్రవేశించిరి. పంక్తులు దీర్చి కూర్చుండిరి. కొందఱెంగిలిమెతుకులపైననే చతికిలఁబడిరి.

స్థలము నిండిపోయెను. ఇంకను గొందఱు మిగిలిరి. అప్పటికె కైదాలు బస్తాల బియ్యముడికినవి. అందఱికిని వస్త్రశస్త్రము లుడిగినవి. అయినను వడ్డన ప్రయత్నములు చేయఁబడియెను. మైలబట్టలతోడనే యొట్లు వడ్డింతురని నేనుమాత్రము వెఱుదీసితినిగాని లక్ష్మీనారాయణశాస్త్రు లడుము కట్టనేకట్టెను. తినువారికి మైలలేనప్పుడు వడ్డించువారి కేమి మైల ? ముడ్లక్రింద మూటలు పెట్టి పంచములందగిలిన పట్టుపుట్టములఁగట్టియే కొందఱును బజారులుతిరిగిన బట్టలతోడనే కొందఱును గవచములు కనఁబడకుండఁ గండువాలఁ గప్పుకొని కొందఱును నాభయముగూడ విడిచి కవచములఁ గనఁబఱచుచునే కొందఱును నందఱును నాపురాపురని యన్నము నాకఁ జూచుచుండిరి. ఒక్క బూట్లుకాళ్లవారు మాత్రము పాదకట్టరుకాని తక్కిన యన్నిరకాలవారును నగపడిరి. దేశమున కొకఁడుగా వచ్చిన తిండిపోతు లట్లు కడుపున కింత యేదియో వేయుటకుఁ గడంగిరికాని యచ్చటి వంటమాత్ర మపరిశుద్ధతమై నాచరింపఁబడదు. ఆమహాసంబాధములోఁ దరువాత బజారు బట్టలవారిచేఁ బరిస్పృశింపఁబడినను వడ్డించువారుగూడ మొదట మడిబట్టలుగట్టుకొన్నవారే. లక్ష్మీనారాయణశాస్త్రియైనను నేతివడ్డనకు దిగెను గాని లాతివడ్డనకుఁ గాదు. ఉత్సవాదులలో స్పర్శదోషము లేదను దాని నాధారము చేసికొని వీనికన్నిటికి నెట్లో సరిపెట్టుకొన్నను నొక్కదానికి మాత్రము నాహృదయము పరితపించినది. అది మహాశివరాత్రి. వచ్చినది పుణ్యక్షేత్రము. ఉపవసించి శివుని బూజించి జాగరమొనర్పవలసిన పుణ్యదినమునఁ బెద్దపేరులు పెట్టుకొనిన డెబ్బదియేండ్లవారిదగ్గఱనుంచి మడియనక మైలయనక యాసంఘభోజనముఁ జేయకున్న నొక్కనాఁటికిఁ జచ్చిపోయెదరు కాఁబోలు! ఈపాటివార లీక్షేత్రమున కేల రావలయును ? ఇదియే నాపరితాపహేతువు. అన్నదానమే యగుఁగాక. అట్టిమహాశివరాత్రినిజేసిన యయ్యంభట్లుగారిదికూడ నకార్యమనక తప్పదు. దేనికిని దేశకాల పాత్రములు చూడవలెను. తక్కటివి తగియున్నను నకాలముమాత్ర మన్నదానయోగ్యము కాదు. మహారాజువలె మఱునాఁడు పెట్టవచ్చును. తొలినాఁడు పెట్టవచ్చును. అలనాఁడు పెట్టవలసినది ఫలాహారమే.

అయ్యంభట్లుగారి యన్నదానవిధమంతయు నవలోకించి యస్మద్బంధుకన్యక యన్నమతినుటయు నపరాహ్ణమునకు నంగడులన్నియు నతిక్రమించి గబ్బిటవారి సత్రమును గనులఁజూచితిమి. ఇయ్యది యిప్పటికి ముప్పదినాలుగువత్సరముల నాఁడే యారంభింపఁబడి నాఁటినుండి నేఁటివఱకు నవిచ్ఛిన్నముగా జరుగుచున్నది. దీని నుపక్రమించి కట్టుదిట్టములొనర్చినవారు గబ్బిట కోటయ్యగారు. వా రొక బ్రహ్మర్షులుకాని

సామాన్యులు కారు. అట్టివారు కనుకనే యావలియీవలిదినముల నన్నదానమును శివరాత్రిదినమున ఫలదానమును జేయుచువచ్చిరి. వీరిసత్రమునకు వేయి రెండువేలు మూఁడువేలవఱకు విప్రులు వచ్చుచుండుటగలదు. ఆవ్యయమునకు ననేకగ్రామంబులు దిరిగి చందాలు వేయించి యేటేట గుమాస్తాలవలన వసూలుచేయించుచుందురు. కొన్ని దినములవఱకు నీయన్నదానాదిక మంతయుఁ దాటాకుపందిళ్లక్రిందనే చేయుచువచ్చి ప్లవసంవత్సరమున గచ్చుతోడను టాలితోడను స్థిరభవనము నిర్మింపించిరి. కోటయ్యగారు తమ కాలముననే కాక తదనంతరమునను దత్సత్రము సాగుచుండుటకుఁగా సంకల్పించి యెవరి నెత్తిని బెట్టినను నీచందాలు వసూలుచేసి యెల్లకాలము నిట్లు నెఱవేర్చుట దుర్ఘటమని స్థిరవసతినే నేకరింప యత్నించిరి కాని యాయత్నము సఫలముగాక పూర్వమే స్వర్గస్థులైరి. తదాది తమ్ముఁడు కృష్ణయ్యగారు తద్భారమంతయుఁ దలపై వైచికొని తథావిధముగనే తత్సత్రమును సాగించుచున్నారు. కొన్నియేండ్లు శివరాత్రి నాఁడు వెనగుగ్గిళ్ళు పెట్టించి తరువాత ఫలాహారమునకు ఫలములే వినియోగించుట యుక్తమని కోటయ్యగారే మార్పుచేయించిరి. కృష్ణాజిల్లాతెనుకుతాలూకా ఖండవెల్లిగ్రామము నుండి కదళీఫలములం దెప్పింప మొదలిడిరి. ఇప్పటికి నదియే ప్రకారము జరుపఁబడుచున్నది. మేమును నపరాహ్ణమున కచ్చటికేగితిమి కాని లోపలఁబ్రవేశించుటకు వశముగాదయ్యెను. అదివఱకనేకపంక్తులు కూర్చుండఁబెట్టి యవనీసురుల కఱ యర్పించినను నంతముగనఁబడదు. అగ్రజులే కాక యవరజుల దగ్గఱనుంచి యందులకు సిద్ధమయిరి. ఫలాహారము పెట్టవలసినది యుపవాసముచేసినవారికే గాని యన్యులకుఁగాదు.

ఉపవసించువారుత్తమవర్ణులగు ద్విజులలోనే నూటికొకరు కనుపింపరు. కాని యాయుపవాసముండు స్వల్పసంఖ్యాకులకే యరటిపండ్లు దొరకుటయే దుర్ఘటము. ఎట్లును నుపవాసమున కియ్యకొన్నవారే కావున వారి కంత యాతురతయుఁ గానరాదు. అన్నిటికిని దిండిపోతులే సిద్ధము. అయ్యంభట్లుగారి సత్రములోని యన్నమును వారికే కావలెను. సెట్టివారి సత్రములోని కదళీఫలములును వారికే కావలెను. పోనిండు. తిను పదార్థములు కనుకఁ బెట్టుట కొప్పుకొందము. ఇచ్చుటఁ దినునవి యొకటిరెండే. కడుపు నిండ నన్నము తిన్నవారికి ఖిదుకనా యవి? కాని చుట్టములకును బక్కములకును జీతగాండ్లకును నాతగాండ్లకును మూటలు గట్టుకొనిపోయి పెట్టవలెను. ఇండ్లకుఁగూడ నన్ని చేర్పవలెను. కొనుటకు మరల ధనవ్యయము కావలయుఁగదా! అన్నియుఁ దెలిసిన యగ్రజుల స్థితియే యిట్లుండ నవరజులమాట యిఁక నడుగనేల? అచ్చటి యన్నదాన మగ్రజులకే కాని యన్యులకుఁగాదు. వారలనర్హులని కాదుగాని యవశమగుటచే నంతమట్టుకే పెట్టుకొనిరి. అందువలన నన్నమున కాశింపరు కాని యరఁటిపండ్లకుమాత్ర

మందలు వాసించిరి. వీనికిఁ జతుర్వర్ణములవారును జందాలిచ్చుచుండిరి. చందాలు మాత్రము మాయొద్ద జమచేయవచ్చును గాని యన్నమునకుఁ గాకున్న నరటిపండ్లకైనను నోచుకొనమైతిమా యని బ్రాహ్మణేతరులు పరుసములాడ వీలున్నది. అరటిపండ్ల వ్యవహార మన్నివిధములయలజడికి నాకరమై పంచిపెట్టుట బహుకష్టసాధ్యమయ్యెను. తలుపులు తెఱచినఁ దండోపతండములుగా వచ్చి తత్ఫలసముదాయముననే పడఁజొచ్చిరి. అందువలన ముందుముందు కొందఱు బ్రాహ్మణులకుఁ బెట్టిపంపించి మహాసమ్మర్దమునకుఁ దట్టుకొనలేక ద్వారములు మూసియుంచిన సమయముననే మా కచ్చేరికిఁ జనుట తటస్థించినది. ఏమి చేయవలె? లోపలి కెట్లుపోవలె? లోపలి ప్రాకారము రాతితోడఁ గాక యినుపచువ్వలచే నేర్పఱుపఁబడియుండ నాసందులలోనుండి లోపలికిఁ గూడ రానీయువారిని రానీయకపోఁగా నింకను నక్కడ నూఱులమంది కూర్చుండియుండిరి. పంక్తులుదీర్చి ఫలములు పంచుచుండిరి.

నర్సారావుపేట డిస్ట్రిక్టుమున్సిఫుకోర్టుప్లీడరులగు తాడేపల్లి సంపూర్ణలక్ష్మీనారాయణ బి. యే., బి. యల్., గారు వాల్కాట్బ్రదర్సుకంపెనీ సబేజంటుగు కొడవటికంటి వెంకటప్పయ్యగారు మున్నగు పెద్దపెద్దలే యాపండ్లను బంచిపెట్టించుచున్నవారు. అందు మాయన్నగారికుమారుఁ డాంజనేయులనువాఁడు గూటి నుండి యమ్మెట్లో లోపలఁ బ్రవేశపెట్టుకొని చేతెఁడుపండ్లు తీసికొనివచ్చి తినుచుఁ దినుచుఁ మావస్త్రములోఁ బోసిపోయెను. అది చూడక సత్రాధికారియగు గబ్బిట కృష్ణయ్యగారుగూడ నొక పెద్దగెల నామీఁదఁ బడవైచెను. ఇన్నిపండ్ల నేమిచేయవలె? నేనును గొందఱికిఁ బంచ మొదలిడితిని. నామీఁదికిఁగూడ నెగఁబడిరి. గెలువలేకపోయితిని. విరమించితిని. కొందఱికొందఱినిగా రానిచ్చి యెట్టులైన నీఫలముల వినియోగింతమని పాప మాబ్రాహ్మణుఁడు బహుప్రయత్నించెను. కొంతమందిని మిద్దెమీఁదికెక్కించి క్రిందివారి యొడులలో ఫలములుపడవేయించెను-ఇంచుకంత తలుపుతెఱచినంతనే యెందఱో వచ్చి పడఁజొచ్చిరి-కాళ్ళు విఱుగఁద్రొక్కిరి. కలహములాడఁగడఁగిరి. విసిగి వేసారి తుదకు ద్వారములు తెఱచివైచిరి. అరటిపండ్లరాశిమీఁది కందఱును నెగఁబడిరి. భక్షకులకును రక్షకులకును గొంతవడి బాహుయుద్ధము ప్రవర్తిల్లెను. ఫలములు బహుచ్ఛిన్నములై పోయెను. మిగిలినవాని నెగఁజల్లిరి. ఆగంతుకు లాశానివృత్తిఁజేసికొని యవలకు వెళ్ళిరి. పాప మాబ్రాహ్మణుఁడు బహుధనమును వ్యయించి ఫలములం బంచిపెట్టఁ బ్రయత్నించియు భక్షకులచేతఁ బరాజితుఁడగుచున్నవాఁడు. ఈఫలాహారముననే కాదు. అన్నదానమునఁగూడ నట్లరిగెను. ఆయనగుమాస్తాలు గాక యన్యులు సాయపడువారు తక్కువ. కూలికివచ్చిన గుమాస్తాలకు భక్తి సున్న. ఇట్టిమహాకార్యములు భక్తుల సాహాయ్యముండినఁగాని బహుశ్లాఘ్యములుగాఁ గానేరవు. భక్తసమాజములు కూర్మదాసపరిభృతుల

సప్తాహాది సత్కార్యములు భక్తిరసము వెల్లువలై పారి యెంతసహాయసంపత్తిగలిగి నిర్వహింపఁబడుచున్నవో తిలకింపుఁడు. భక్తులసాహాయ్యమైన నుండవలయును. ప్రభుత్వము వారి సాహాయ్యమైన నుండవలయును, దీనికి రెండును లేవు. పరికింప నియ్యది భక్తసమాజములకు నెంతమాత్రము తీసిపోవునది కాదు.

భక్తసమాజములకంటె సహాయసంపత్తి యెక్కుడుగ గలుగుటయును దీని కంతగా లేకపోవుటయును గల కారణ మరయవలసియున్నది. ఆ కార్యములు ప్రత్యేకించి చేయఁబడునవి కాని యొకదానిలోఁ జేరినవి కావు. జను లకార్యములకు భగవన్నామసంకీర్తనమును వినియుఁ గనియు స్వయముగాఁ జేసియుఁ దరింపఁ దలఁచియే యేగుచుందురు. అందువలనఁ దద్భగవద్భజనాదికముదప్ప వారి కితరవ్యాసంగముండదు. అట్లు ప్రత్యేకించి తత్కార్యములయందే లక్ష్యబుద్ధితోఁ జనినవారు వలయునంత సహాయసంపత్తి యాకార్యములందుఁ జేయుట విధియైయున్నయది-కోటప్పకొండ తిరునాళ్ళకు వచ్చుబ్రాహ్మణాల కన్నముఁబెట్టుటకొఱకుఁ గోటయ్యగారు సత్రముఁ బెట్టిరి కాని సత్రములో సత్కాలక్షేపముఁ జేసి కాని సాహాయ్యమొనరించి కాని సద్గతిఁ జెందుదమని జనులు చనుదెంచుటలేదు. తిరునాళ్ళకు వచ్చినవారికి దేవునిదర్శించుట తీర్థములఁ గ్రుంకుట మొదలగు స్వార్థములయందే యాతురత యెక్కుడై యుండును. వీరు సత్రమునకు వచ్చుట యెల్ల క్షుధోపశాంతికిని జిహ్వాచాపల్యనివృత్తికిని. అట్లు తేరగా వచ్చునది తినిపోవవచ్చువార లాకిలోఁ బెట్టుచునా వడిలోఁ బెట్టుచునా యని తమయాకలి తాము చూచుకొనిపోక తత్కార్యసాయము మేలకావింతురు ? సప్తాహాదులకును సత్రములకును నున్న తారతమ్య మియ్యది-అందువల్ల నయ్యంభట్లుగారి సత్రమునను గోటయ్యగారిసత్రమునను నితరసాహాయ్యము చాలఁ దక్కువయైయున్నది. దేవళమునొద్దను తీర్థముల యొద్దనువల్ల రద్దీకలుగకుండ నొకరితరువాత నొకరికి దర్శనమజ్జనాదికములబ్బుటకై జను లనేకులనుంచి యెట్టి సహాయముచేయుచుండిరో యట్టిసహాయము ప్రభుత్వమువారే సత్రమునందును జేయవలసియున్నది-ఇచ్చటి గలలోటుపాట్లు సరిచెప్పఁదగినవారు చెప్పినఁగాని ప్రభుత్వము వారు శ్రద్ధవహింపరు. సత్రములోని సంగతులు బ్రాహ్మణులకుఁ దెలిసినట్లు బ్రాహ్మణేతరులకుఁ దెలియఁబడవు-బ్రాహ్మణులలోని యున్నతోద్యోగులు ధర్మమార్గవిషయమున విరుద్ధాభిప్రాయులై యున్నవారు. అన్నదానము గాని యర్థదానముగాని యతిదీనులకు నంధపంగ్వాదులయెడఁ నాచరితవ్యముగాని సోమరులకు భూభారులకు చేయఁగూడదని వారి యాశయము-ఆదానములకు నంధపంగ్వాదులు నన్నులే-యువసీసులు నన్నులే. వారికిఁ గొందఱు కాపించుచున్నారు- వీరికిఁ గొందఱు కాపించుచున్నారు.

లోకులో భిన్నరుచులు. ఎవరియిష్టము వారిది. మంచి కార్యములుచేయువారిని మనకు కొన్ని చేయుటకుఁ బ్రేరేపవచ్చునుగాని చేయుదానిని నిషేధింపఁగూడదు. వారి

శక్తినిబట్టి వారు వర్తింతురు. నిషేధ్యము నింద్యకార్యముగాని మంచికార్యముగాదు. ఒకమంచివానిని మంచివాఁడని భూషించిన వాఁడుమాత్రము మంచివాఁడు కాఁడా యనునదికాదు సమాధానము. కావున నున్నతోద్యోగులైన బ్రాహ్మణులు తదభిప్రాయము మార్చుకొని కోటయ్యతిరునాళ్లలోని సత్రములలో గాటమైనసాహాయ్యముచేయఁ బ్రభుత్వమువారిని బ్రేరేపఁ బ్రార్థితులు. అట్లు గబ్బిటవారిసత్రములోని కదళీఫలదానవిధమంతయుం గనుంగొని కొండకెక్కి కోటీశ్వరుదర్శించి వచ్చుటకుఁగా బయలువెడలితిమి. బాజారులు ప్రజలచేఁ బరిపూర్ణములైయున్నయవి. ఇసుకవైచినఁ గ్రింద రాలకుండనున్నది. అట్టిజనసంబాధములో నట్టే నెట్టుకొనుచు ముందు నేనును నటువెనుక నర్ధాంగియుఁ బదపడి బంధుబాలికయు నొకరిచేయి నొకరము విడువక వరుసగాఁ బ్రతిదుకాణమును బరిశీలించుచుఁ దీసికొనఁదగిన వస్తువులు కొన్నితీసికొనుచు నతికష్టముతోఁ గొంతసేపటికిఁ గొండ సమీపించితిమి. పట్టణస్థమును బహుమూల్యమును నగుప్రతివస్తువును బణ్యవీథులం బ్రదర్శించితిమి. అవ్వియన్నియుం గొనవలెనన్న నవనీశ్వరులకును నశక్యములని యనుకొంటిమి. నేయిదుకాణములకుఁ దక్కువయుండవు. ప్రతిదుకాణమును బ్రజాభరితము. ఇదియునుంగాక కాఫీహోటలులు సోడాషాపులు మున్నగు నీకాలమునకుఁదగిన యెల్లవిశేషములును నేర్పడియున్నయవి. అన్నియు నంతటంతట నవలోకించుచు నతికష్టముతో నద్రిసమీపమునకు రానచ్చోటఁ బ్రజలయొక్కయుఁ బ్రభలయొక్కయు సంబాధము మఱింత యగ్గలమగుటయు భరింపలేకపోయితిమి. ఈజనాటవినుండి యవలి కెప్పుడరిగెదమాయని యనుకొంటిమి. బొచ్చుమల్లయ్యగుడిఁ జొరఁగాంచితిమి. తత్ప్రాంతమంతయుఁ దలవెండ్రుకలతోఁ గలితమైయుండెను. అచటినుండి మెల్లగాఁ బర్వతమెక్కఁ బ్రారంభించితిమి. ప్రతిమెట్టునను బట్టలుపఱచుకొనియుండు భిక్షుకజనమును వీక్షించితిమి. కటకటా ! కడుపు తఱుగుకొనిపోయెను. తత్కష్టమును దైన్యమును జూచినకొలఁది కనులవెంట నీళ్లుగారెను.

ఏమిగాఁజేసిన నేమిచేయను? కాసో వీసమో యీయఁగలము కాని లెక్కకుమిక్కిలి ద్రిక్కిరిసియుండు నింతమంది దైన్యము నేమిపాపఁగలము? అది ధనికులపని. వారికి బుద్ధిపుట్టదు. అట్లు వారి యలజడికి తలమటపడుచు నక్కడక్కడఁ గూర్చుండుచు నచలాధఃప్రదేశమం దలరారెడి యసంఖ్యాకజనుల నవలోకించి యాశ్చర్యపడుచు నేతెంచువారి యెదురుతాఁకుల నెట్లో తట్టుకొనుచు గొల్లభామగుడిదాఁటి కోటయ్యగుడికడ కేగి బ్రతుకుజీవుఁడాయని యాయాసముదీఱఁ గొంతవడి గూర్చుంటిమి. అన్నియు నైనయది కాని గుడిలోనికేగుటయుఁ గోటీశ్వరు దర్శించుటయు నింక మిగిలియున్నవి. తక్కినవన్నియుఁ దదంగములు కాని తత్కార్యమే తదుత్సవాగమనమునకు నిదానభూ

తము. రక్షకభటుల లాఠీపోటులకును దొరవారి సేవకుల తోలుదెబ్బలకును గుఱికా కుండ నాలయములోని కరుగుట యసాధ్యమైనపని. జనసమ్మర్దమునకు శరీరమంతయు జర్జరితమయ్యెడిని. అంతటికష్టమున కోర్చి యాడుపిల్లలతోడ నాలయములోపలి కరుగుట యెట్లా యని యాలోచించుచుండ నాకోటీశ్వరుఁడే యనుగ్రహించి యస్మ ద్విషయమై యత్యంతాభిమానముగల యారక్షకశాఖాధికారి నొక్కరు నగపఱచెను. ఆయన సనాతనధర్మనిరతుఁడును సజ్జనప్రియుఁడును సాధుసేవకుఁడును నగు గోటేటి వేంకటగోపాలరావుగారు. గుంటూరుతాలూకా ప్రత్తిపాటిలోఁ బోలీసుసబిన్స్పెక్టరుగా నుండి ప్రభుత్వమువారిచేఁ బ్రకృతోత్సవమునకు సహాయార్థ మనుపఁబడిన యామహా దారుఁడు మమ్ముఁ గాంచినతోడనే మహాదరంబునఁ దోడ్కొనిపోయి యితరజనసంస్ప ర్శ మిసుమంతయు లేకుండ గర్భాలయమునఁ జేర్చుటయుఁ గరుణానిధియగు పరమే శ్వరు దరిసించి కరమనకాశంబుతోఁ గర్తవ్యమంతయుం దీర్చుకొంటిమి. ఇంతలో సాయంసంధ్యాసమయ మాసన్నమయ్యెను. అచ్చటికిఁ బైభాగమునుండి దొనలయొద్ద కరిగితిమి. ఆప్రాంతముననే రాజాపేటవారి సత్రము కనుపట్టెను. అనేకులు భుజించు చుండిరి. ఫలాహారము చేయువారికి సెనగగుగ్గిళ్ళఫలాహారమును నన్నముతినువారి కన్నమును బెట్టుచుండిరి. అట్లు ప్రొద్దుటినుండివచ్చినవారికిఁ బెట్టుచుండిరఁట. అప్పటికిని వంతు ముట్టలేదు. మరల బియ్యముకడిగి వంటమొదలుపెట్టుచున్నారు.

దానిపరిసమాప్తి యెప్పటికో తెలియఁబడదు. అయ్యంభట్లగారి సత్రముననో యన్నసత్రమో యామహాశివరాత్రి నదివఱ కొకసారియో రెండుసారులో తిన్నవారలే మఱలవచ్చుచుండ నిఁక దానికి సమాప్తి యెట్లగును? అన్నమున కన్నముందిని మరల గుగ్గిళ్ళకుఁ జెయిఁజాపువారు నందుఁ గొందఱు. ఈసత్రములు చాలభాగ మిట్టి తిండి పోతుల కుపయోగపడుటఁజూచియే కొందఱు బుద్ధిమంతులు వీనివిషయమై విరుద్ధాక్షే ప్రాయము లిచ్చుచున్నారు. నేనును సాయంసంధ్యవార్చి యున్ని సెనగగుగ్గిళ్లు భక్షించి తిని. నాభార్యయుఁ గుదకు బంధుబాలికయు సెనగగుగ్గిళ్ళనే చెఱియొన్ని తినిరి కాని యన్నముతినుట కభిమతింపకైరి. బాలికలైననేమి హాలికులైననేమి నాఁడుతిన్న యన్న మన్నమే కాదు. అది యున్నమే. అంత హరాహరా యని యందఱమును నద్రి దిగితిమి. మాపటివేళయైనను మాకుఁ బడక మంచిగనే యింతజనసంబాధములోనుండి యెట్లో తప్పించుకొని గబ్బిటవారిసత్రమును గనుగొనఁగలిగితిమి. అప్పుడే తత్సత్రమున మఱు నాఁటి యన్నప్రదానమునకు నుంచి గుమ్మడికాయలు తఱుగుచున్నారు. కాయలుమాత్రము కావలసినన్ని కానఁబడుచున్నవి కాని తఱుగువారిరువురుమువ్వురే తటస్థించిరి. అనేకులాసత్రముననే పరుండి హాయిగా నిద్రించుచున్నారు. పగలుప వసించినచో రాత్రి మేల్కొంచియుందురు కాని కుట్టుపట్టఁదిన్నవారికిఁ గూర్కొరాక

యాజ్ఞవల్క్యః॥ శ్లో॥ అగమ్యాగమనాత్పాపా త్పాపేభ్యశ్చ ప్రతిగ్రహాత్ । రహస్యాచరితా త్పాపా న్ముచ్యతే స్నానమాచరన్ ॥ మాంద్యప్రసాదజనకం రూపసౌభాగ్యవర్ధనం । శోకదుస్స్వప్నహం స్నానం మోక్షదం హ్లాదనం తథా॥ స్నానమూలాః క్రియాస్సర్వా శ్శ్రుతి స్మృత్యుదితా నృణాం । తస్మా త్స్నానం నిషేవేత శ్రీపుష్ట్యారోగ్య వర్ధనం॥ యామ్యంహి యాతనాదుఃఖం నిత్యస్నాయీ నపశ్యతి ॥ ఈ యాజ్ఞవల్క్యవాక్య మగమ్యాగమనము చేసినందువలనఁ గలిగిన పాతిత్యమును బాపాత్ములగువారివలన దానముతీసికొన్నందువలనఁగలిగెడు పాపమును రహస్యకృతములైనపాపములను స్నానము పోఁగొట్టునని యు మాంద్యమునశించుననియు శరీరమునకుఁ జక్కని రూపముగలుగు ననియు నారోగ్యముగలుగుననియు దుఃఖదుస్వప్నములు పోవుననియు మోక్షము సిద్ధించుననియు శ్రుతిస్మృతిప్రతిపాదితములగు సర్వక్రియలు స్నానపూర్వకములనియు నిత్యస్నానపరుఁడు యమలోకమందు యాతనాదుఃఖముల ననుభవించఁడనియుఁ జెప్పుచున్నది. కానఁ బ్రాతస్స్నానము వలన శరీరారోగ్యా ద్యైహికఫలమును బాపక్షయపూర్వకమగు పరలోకసుఖమును జనుఁడు పొందఁగలఁడు. దక్షః॥ అస్నాత్వా నాచరేత్కర్మ జపహోమాది కించన సర్వంహంతి విశుద్ధాత్మ ప్రాతస్స్నానేనదుష్కృతం॥ ప్రాతరుత్థాయ యో విప్రస్సంధ్యాస్నానం సమాచరేత్ । సప్తజన్మకృతం పాపం త్రిభిర్వర్షైర్వ్యపోహతి॥స్నానముచేయకుండ జపహోమాదికర్మములు చేయఁగూడదు.ప్రాతస్స్నానమువలన సమస్త దుష్కృతమును నశించును. ప్రాతస్స్నానసంధ్యావందనములు తప్పక నిత్యము విధియుక్తముగా 3 సంవత్సరము లాచరించినయెడల నింతకు ముం దేడు జన్మములనుంచి యాచరించిన పాపము లన్నియు నశించునని యీశ్లోకములు చెప్పుచున్నవి.

గృహస్థవానప్రస్థులకుఁ ప్రాతర్మధ్యాహ్నకాలములందును యతికిఁ ప్రాతర్మధ్యాహ్నసాయంకాలములయందును స్నానము విహితమైనది. బ్రహ్మచారికిఁ బ్రాతస్స్నానము చాలును. స్మృత్యర్థసారమందలి "ప్రాతర్మధ్యాహ్నయోస్స్నానం వానప్రస్థగృహస్థయోః, యతేస్త్రిషవణస్నానం సకృచ్చ బ్రహ్మచారిణా" మను వాక్యము పైనఁ జూపిన విషయమును దెలుపుచున్నది. శిఖనుబంధించి కరపాదప్రక్షాళనము చేసికొని యాచమనముచేసి దర్భ హస్తమందుఁగలవాఁడై సంకల్పము చెప్పుకొని జలమునకు నమస్కరించి యంజలిపట్టుకొని తూర్పు ముఖముగా జలములోనికి దిగి స్నానము నాచరింప వలయును. స్కాందే, శ్లో॥ ఉదయాత్ప్రాక్చతస్రస్తు నాడికా హ్యరుణోదయః। తత్రస్నానం ప్రశస్తం స్యాత్సహి పుణ్యతమస్స్మృతః॥ ఈశ్లోకముచే సూర్యోదయమునకుముందు నాలుగుగడియలకాల మరుణోదయమనియు నాకాలమందు స్నానముచేయుట ప్రశస్తమనియుఁ బుణ్యసంపాదకమనియుఁ జెప్పఁబడుచున్నది. ఆచమనసంకల్పమార్జనాదివిధులను వదలి స్నానముచేసినయెడల నాస్నానమువలనఁ బరమార్థానుకూలమగు ధర్మము పుట్టనేరదు. స్నానముచేసి జలమందుండి యొడలు తుడుచుకొనకయే దేవఋషిపితృతర్పణము చేయవలయును. ఇది స్నానాంగతర్పణము.

శ్లో॥ నాభిమాత్రజలేస్థిత్వా చింతయ న్నూర్ధ్వమానసః। దేవాన్ దేవగణాంశ్చాపి ఋషీన్ ఋషిగణానపి॥ అథ కాండఋషీనేతా నుదకాంజలిభి శ్శుచిః। అవ్యగ్ర స్తర్పయేన్నిత్యం మంత్రైరేవ స్వనామభిః॥ పితౄన్ పితృగణాంశ్చాపి నిత్యం సంతర్పయే త్తతః॥ ఈస్మృతివాక్యములు బొడ్డులోఁతుగల జలమందుండి దేవఋషిపితృతర్పణము చేయవలయునని చెప్పుచున్నవి. తూర్పుముఖముగానుండి దేవతలకు నుత్త

రాభిముఖుఁడై ఋషులకు దక్షిణాభిముఖుఁడై పితృదేవతలకు జల మధ్యమందుండి తర్పణము చేయవలెను. ఉపవీతముగా దేవతీర్థముచే దేవతలకును నివీతియై ఋషితీర్థముచే ఋషులకును ప్రాచీనావీతముగాఁ బితృతీర్థముచేఁ బితృదేవతలకును దర్పణము చేయవలెను. దేవతాఋషి పితృతర్పణానంతరము తటమందు జలతర్పణము చేయవలెను. శ్లో॥ యన్మయాదూషితంతోయం శారీరమలసంచయాత్। తద్దోషపరిహారాయ యక్ష్మాణం తర్పయామ్యహం॥ ఈశ్లోకము పై తర్పణమును విధించుచున్నది. పైనఁజెప్పిన దేవతాదితర్పణములు చేయువఱకు వస్త్రము పిండఁగూడదు. శ్లో॥ యావద్దేవాన్ ఋషీంశ్చైవ పితౄన్వై యో నతర్పయేత్। తావ న్నపీడయే ద్వస్త్రం యేనస్నాతో భవేన్నరః॥ నిరాశాఃపితరోయాంతి స్నానవస్త్రే నిపీడితే। తస్మా న్నపీడయే ద్వస్త్రమకృత్వా పితృతర్పణం॥ ఈవాక్యములు వస్త్రపీడనముచేసిన యెడల దానితో స్నానపరిసమాప్తి యగుననియుఁ దరువాత స్నానాంగమగు పితృతర్పణాదు లాచరించుటకు వీలులేదుగావునఁ బితృదేవత లాశారహితులై పోవుదురనియు నందువలన వస్త్రనిపీడనము దేవఋషిపితృతర్పణాదులకు ముందు చేయఁగూడదనియుఁ జెప్పుచున్నవి. స్నానమైన పిమ్మట గట్టుకువచ్చి కొంచెముకాలము వస్త్రజలమును దేహజలమును భూమిమీఁదఁబడువఱకుఁ బ్రాచీనావీతముగా నుండవలయును. దాని వలనఁ దనయింట దాసులై యుండి మృతిచెందినవారలకును నితరభూతములకును దృప్తియగును. ఆ యెద్దుననున్నప్పుడు జుట్టుమాత్రము ముఖమువైపునకు వేసికొనవలెను.ఆలాగున వేసిన వెంట్రుకలవల్ల నుండి జాఱిన యుదకబిందువులు మహాతీర్థోదకబిందువులగును. ఆవెంట్రుకలు పృష్ఠభాగమందున్న యెడల నచ్చటనుంచి జాఱుబిందువులు మద్యము యొక్క బిందువులతో సమమగును. శ్లో॥ సురాబిందుసమాఃప్రోక్తాః

పృష్ఠతః కేశబిందవః। తావేవ పురతః ప్రోక్తా స్సర్వతీర్థోపమా బుధైః॥ ఈశ్లోకము పైయర్థమును జెప్పుచున్నది. గోభిలః॥ శ్లో॥ పిబంతి శిరసో దేవాః పిబంతి పితరో ముఖాత్ । మధ్యత స్సర్వగంధర్వా అధస్తాత్సర్వజంతవః॥ ఈవాక్యము స్నానముచేసి గట్టునందుఁ గేశములను ముందుభాగమునను౦చుకొని జలపాతముకొఱకు నిలిచియున్న బ్రాహ్మణుని శిరఉదకమును దేవతలును ముఖోదకమును బితృదేవతలును మధ్యమునను౦డు నుదకమును గంధర్వులును క్రిందిప్రదేశమందైన జలమును నితరజంతుజాలమును బానము చేయుదురని చెప్పుచున్నది. అయితే గొందఱిటులందురు.

"స్నానము కిన్నినియమములుండవలయునా? స్నానమువలన దేహ పరిశుద్ధత యొక్కటిమాత్రము మనకుఁ గనిపించుచున్నది. ఆపరిశుద్ధత కీనియమము లనావశ్యకములు. దేవఋషిపితాదులకు మనము తర్పణములు చేయకున్న దాహముతీఱకుండునా? లోకములోజనుల కందఱికి దాహనివృత్తికొఱకుఁ దర్పణోదకము కావలసియున్నదా? ఇష్టమైన జలము పానముచేయుటలేదా? అటులనే దేవఋషిపితరులు తమ కిష్టమైన నద్యాదిజలమును బానముచేసి తృప్తులుకాలేకయున్నారా? నిజముగా మనయంజలులచే నీయఁబడ్డ జలముకుఁ బరిశుద్ధత తక్కువగానే యుండును. మనవారు నదులలో స్నానముచేసి బురదనీరునే తర్పణము చేతురు. ఆనీరు వా రెటులఁ బానముచేతురు? మనము పానము చేతుమా? ఈతర్పణముచేయువారుగూడ నాజలము పరిహరించి శుద్ధజలమును బానముచేతురుగదా! నిజముగా నొకరియంజలిలోని జలమును మఱియొకరు పానముచేయుటకు సహించరే. ఆ చేతులలో నేమైన మాలిన్యముండునేమోయని సందియముండక మానదు. దేవాదులు మనకన్న గొప్పసుఖముగలవారనియు దివ్యదేశములుగలవారని

ము మానససరోవరాది మహాతీర్థములుగలవారనియుఁ జెప్పుదురు గదా ! వారి కేమి దారిద్ర్యము సంభవించెనో ? మనము స్నానము చేయుచుఁ జేతులతోఁ బోయు బురదనీళ్ళకొఱకు నోళ్ళు తెఱచుకొని యుందురనియు మనము పోయకపోయిన నిరాశులై పోవుదురనియుఁ జెప్పుటకుఁ దగిన కారణము గనుపించదు. జుట్టు వెనుకవైపునున్న దానినుంచి జాఱినబిందువులు సురాబిందువులు ముందఱనున్న గంగాదితీర్థబిందువులు నగుటగూడ నసమంజసమే. వెనుకనున్న వానిని ముందుకు మార్చుటతోడనే గంగాబిందువులై పోవుననునవి మోహాకరములగు పాపావహ వాక్యములగుటకు సందియము లేదు. స్నానము చేసిన బ్రాహ్మణుని శిరోజలము దేవతలును ముఖజలము పితృదేవతలును మధ్యప్రదేశజలము గంధర్వాదులును పానముచేతురని చెప్పుట మఱింత యనర్థకముగానున్నది. పరిశుద్ధులగు దేవాదులమంగళములగు శిరోముఖాదిజలమును శరీరదుర్గంధయుక్తమైనదానిని పానము చేయుదురని చెప్పుటకు ఏరిమనస్సెట్లొప్పినదో తెలియకున్నది. హీనజనుఁడుగూడ నొకని తలలోని నీరు ముఖమందలినీరు నడిమినీరు క్రిందినీరు త్రాగుమని చెప్పిన నమితాసహ్యతగలవాఁడై చీయని తొలఁగి పోవునుగదా ! అమితభోగము ననుభవించు దేవాదులీలాటి దుష్టజలము నపేక్షించుదురనుటకన్న మఱియొకదోషముగలదా ? దేవఋషిపితరులు మనయందుఁ బ్రేమగలవారగుదురా ? కానేరరు. విచారించ మనయందు ద్వేషముగలవారై మనలను బాధింతురనికూడఁ జెప్పవచ్చునుగాన నీ స్నానవిధిశ్లోకములు నమ్మఁదగ్గవి కావు. దాంభికులచే వ్రాయఁబడినవికాని ఋషిప్రోక్తములు గావని నమ్మఁదగినది. ”

ఈరీతిగా శాస్త్రతత్త్వానభిజ్ఞులగువారి ప్రలాపములుండును. కాని శాస్త్రప్రామాణ్యాభిజ్ఞులగువారీవాదమును లెక్కించరు.

శ్లో॥ తస్మాచ్ఛాస్త్రం ప్రమాణంతే కార్యాకార్యవ్యవస్థితౌ॥ అనుగీతా వాక్యముచే శ్రీకృష్ణపరమాత్మ యింద్రియగోచరముగాని విషయము నుగూర్చి శాస్త్రమే ప్రమాణముగాని మన యుక్త్యాదులు పనికిరావని చెప్పినట్టుగా నిరూపించఁబడినదికదా ! స్నానమువలన బాహ్యదేహ శుద్ధత మనకు గ్రాహ్యమైనను నాంతరికాంతఃకరణశుద్ధ్యాదులు ప్రత్యక్షములు గానేరవు. అనుభవజ్ఞులగువారిచే హేత్వంతరములవలన నూహించఁబడుననుటకు సందియములేదు. ఊహించఁ బడకున్నను శాస్త్రము చెప్పుచున్నది కనుక స్నానమువలనఁ బరమార్థోపయోగము గలదని మనము నమ్మఁదగియున్నది. ఆశాస్త్రవాక్యములు చూపించఁబడినవి. అయితే నావాక్యము లెవరో దాంభికులు వ్రాసినారని యనెదమనిన నిది ప్రాజ్ఞ సమ్మతముగాదు. స్నానము పరమార్థోపయోగియనియు నీరీతిగా నాచరించవలయుననియుఁ బలిస్మృతియందును జెప్పఁబడియున్నది.

పురాణేతిహాసాదులుగూడఁ జెప్పుచున్నయవి. ఆస్మృత్యాదులు మహర్షి కృతములే. ఇతరులైనదాంభికులు వ్రాసి యాస్మృతులలోఁ జేర్చినారనిన నమ్ముటకుఁ బ్రమాణమేమికలదు ? మాకుఁదోఁచుచున్నదనిన నిదిప్రమాణమగునా ? కలికాలమగుటచే సనాతన ధర్మముల యందు శ్రద్ధలేక యవియాచరించుటకు సోమరులై స్వేచ్ఛావిహారులై ధర్మదూషకులమైనఁ బరమార్థహీనులమగుదుమను వివేకము లేక యిష్టమువచ్చినట్టు సర్వజ్ఞత్వాభిమానముచేఁ బలుకుచుందురు. ఈపలుకులా ప్రమాణములు ? " శాస్త్రవాక్యము లీవిధముగా ధర్మాచరణ చేయవలయునని చెప్పుటకుఁ దగిన యనుభవము గనుపించదు. మన కనుభవానుకూలములై లౌకికాచారవిరోధములేని శాస్త్రవాక్యములు నమ్మఁదగినవే. అటులఁగాని శాస్త్రవాక్యము లెటులనమ్ముదు " మనిన

నిది సరిగాదు. శాస్త్రాభిప్రాయమును గనిపెట్టుటకు మనము సమర్థులముగాము. విద్వాంసులగు మహనీయులకుఁ గొన్ని శాస్త్రవాక్యముల కభిప్రాయము తెలిసి యుపపాదింతురు. సామాన్యజనులకు శాస్త్రాభిప్రాయము గనిపెట్టుట దుర్ఘటము. సర్వజ్ఞుఁడగు పరమేశ్వరుఁడును దదనుగ్రహముచే సర్వమును దెలిసినఋషులును జీవుల కుపయోగముగా శాస్త్రమును జెప్పియున్నారు. ఆశాస్త్రాభిప్రాయ మామహనీయులకే సంపూర్తిగా గుర్తగునుగాని మనకుఁ దెలియఁబడదు. ఆమహాఋష్యాదుల కనుభవముచేఁ దాము గనిపెట్టి చెప్పిన విధులు ప్రజ లాచరించుటయందే యభిప్రాయముగాని తాము చెప్పిన శాస్త్రానుభవముగూడ నీప్రజలందఱికిని దెలుపుటయం దభిప్రాయము లేదు.

శాస్త్రతత్త్వవేత్తలగువారు మనయభిప్రాయమును గొందఱు కొంతవఱకుఁ దెలిసికొనఁగలరు, కొందఱు తెలియకయుండవచ్చును, గాని రాజాజ్ఞవలెనే మనయాజ్ఞననుసరించి మనవాక్యములఁబట్టి స్వధర్మాచరణగలవారై యందఱును దరించుటలో సందియము లేదని మహాఋష్యాదుల యభిప్రాయము. ఈవిషయమై లౌకికదృష్టాంతమును గలదు. గవర్నమెంటువారు మనల హిందూలాప్రకారము పరిపాలన చేయుచున్నారు. హిందూలాయనఁగా మన ఋష్యాదులు చెప్పిన శాస్త్రపుఁబద్ధతియే! ఆపద్ధతి ననుసరించి కొందఱు బుద్ధిమంతులు కొన్ని చట్టముల నేర్పఱచియున్నారు. ఆచట్టములయొక్క పూర్ణానుభవము వారికేకలదు. ఆచట్టములు ప్రశస్తములని గవర్నమెంటువా రాచరణలోకిఁ బెట్టినారు. మనమందఱము నాచట్టముల కనుకూలముగా నడచుకొనుచున్నారము. ఈనడచుకొను జనులకందఱకు నీచట్ట మీయనుభవముతో నేర్పఱుపఁబడినదని చెప్పుటకు సాధ్యమగునా? కాదు. గొప్పలాజ్ఞానమును లోకజ్ఞానమును గలవారికిఁ గొందఱి కాచట్టముల యభి

ప్రాయము తెలిసియుండవచ్చును. అందఱికి ననుభూతముగాదు. కాని యనుభవములేనివారుగూడ నాచట్టమును వదలుకొని విరుద్ధముగా నాచరించుటకు వీలులేదు. చట్టము కనుకూలముగా నాచరించియే తీరవలెను. అటులనే మనకు శాస్త్రవిధుల యభిప్రాయము బోధపడకున్నను నాశాస్త్రవిధి ననుసరించి యాచరించఁదగినదికాని విరుద్ధవాదములచే మానఁగూడదు. అటుల మానుకొనిన నీశ్వరనిగ్రహపాత్రులై రౌరవాదినరకకూపములఁ బొందుదురనుటకు సందియములేదు. శాస్త్రము చెప్పినటుల నాచరించుటయే మనపనిగాని శాస్త్రముచేఁ జెప్పఁబడిన క్రియలు లోకానుకూలముగా లేవనుటగాదు. సర్వజ్ఞమూర్తులగు ఋషు లేయభిప్రాయముతో నటులఁ జెప్పియున్నారో వారటులఁ జెప్పుటచేతనే మనకుఁదోఁచు లౌకికవిరోధము లప్రయోజకములని యెంచవలెను.

ప్రకృతమగు స్నానవిధులుగూడ మహఋష్యాదు లనుభవముచే లోకోపకారమును గనిపెట్టి చెప్పియున్నారుగాన మనము పరమార్థలాభముకొఱకు వారు చెప్పినరీతిని దప్పకుండ నాచరించుట ధర్మము. ఈ స్నానాంగమగు సంకల్పాదు లనుపయోగములనియు లోకవిరుద్ధములనియుఁ దోఁచినను గొప్పదగు పరమార్థప్రయోజనము గలదని నమ్మఁదగినది. లౌకికవిరోధములు శాస్త్రవిధుల నడ్డుకొనఁజాలవు. మన యుక్తు లుపయోగించవు. సర్వజ్ఞమూర్తులగు ఋషులకు మనమాత్రము లోకజ్ఞానము లేకపోలేదు. స్నానాంగములగు తర్పణాదులు దేవాదులు పుచ్చుకొనుటలేదు కాని యాజలములకు బదులుగా నమృతతుల్యజలప్రాప్తి గలుగునని నమ్మఁదగినది. వారినిగూర్చి మనుష్యులచే భూలోకమందుఁ జేయఁబడు హోమతర్పణాదులవలన వారి కెక్కువతృప్తి గలదనియు నాతృప్తిచే భూలోకమున జనులకు వర్షాదులచే సమస్తసస్యాదివస్తువులను గలుగఁజేతురనియు

## —§ పురశ్చరణసప్తమీవ్రతవిధానము §—

శా॥ పుష్పాదిత్యుఁడటంచుఁ బేరుకొని యాభూదేవు లాభాస్కరున్
బుష్పాద్యర్చితుఁ జేయుచుండుటయు సంపూర్ణప్రమోదంబుతోఁ
బుష్పం డమ్మణిభద్రు భూమిపతిచేఁ బోకార్చఁగంజేసి త
త్పుష్పాంగిన్ హరియించుటాది సకలంబున్ స్వీయవృత్తాంతమున్ ౮౬౯

వ॥ ప్రకాశించుటయు వారలలిగి ౮౭౦

కం॥ "పాపిష్ఠుఁడ! నీకిఁక నే ప్రాయశ్చిత్తముండు, నీనిష్కృత్తం
బీపాటఁ దీసికొనిచను. నీపాలిట బ్రహ్మహత్య నిలఁబడియుండెన్, ౮౭౧

తే॥ భూసురుఁడు క్షత్రియుఁడు వేరి మూవురును ద్విజాతులని స్మృతిశాస్త్రవిచక్షణులు వ
చించుదురు కాన క్షత్రియుఁద్రుంచినట్టి యీవు బ్రహ్మఘ్నుఁడైతి విసీ కుశీల!"

వ॥ అని నిందించుటయుఁ బుష్పండు దుఃఖించుచు బ్రహ్మస్థానంబునుండి
బయలువెడలె, నారూయమాణుండగు నతని విలోకించి నాగరబ్రాహ్మణులు కొందఱు

శా॥ "సర్వజ్ఞప్రతిముండుగానిద్విజుఁ డీస్థానంబునం దుండఁ, డా
యుర్వీదేవులయిండ్లలేని స్మృతిముఖ్యోద్గ్రంథము ల్గానరా,
వీర్వింకింపుఁడు వానిఁ బ్రాజ్ఞులుకరం, బీదేనిసంశుద్ధి యా
పూర్వాచార్యులువ్రాసినట్టిసుకృతు ల్శోధింపఁగంగల్గెడిన్" ౮౭౪

వ॥ అని వాక్రుచ్చుటయుఁ జండశర్మయను నొకబ్రాహ్మణుండిట్లనియె, ౮౭౫

తే॥ "ఏను స్కాందపురాణమం దెప్పుడును బురశ్చరణసప్తమియటంచు రమణఁ జదువు
చుందును, బురశ్చరణమువనుండిపోలె దానఁడియుఁ బోవుఁ బాతకము, నిజము,

కం॥ కానఁ బురశ్చరణాభిధమై నెగడెడి సప్తమిని మహాశ్రద్ధమెయిన్
దానొనరించును గావుత, మేనఁతుయమగును వెంటనే రూఘముగన్, ౮౭౬

తే॥ ఇదియునుంగాక తన్మేదినీశ్వరుండె భటులచేతను మణిభద్రు ప్రాణముల హ
రించెఁగావున బాప మేతెంచునెడల దానికిన్ బాధ్యుఁ డాతండె తథ్యముగను,

తే॥ ఎవఁడు న్యాయాధికారియై వ్యవస్థాతఁగల నిజమెఱుంగక నేరంబు నిర్ణయించి
శిక్షఁజెప్పును దాన సంసిద్ధమైనపాతకంబున కాతఁడే బాధ్యుఁ డరయ, ౮౭౯

తే॥ మఱియు నాతండ్రి భూసురమధ్యమునను బ్రీతి నీతనికిచ్చి నా పెండ్లిచేసె
ననుచు వచియించె నాతని యర్ధదేహ యాపెకేకాక యెవరి కాయఘముచెందు?

కం॥ అపకృతుఁడై యీతఁడు తా నపకృతిగావించెమగుడ, నా హేతువునన్
విపరీతముగాదది, యిఁక సుపథముగనె నిశ్చితంబు సుజ్ఞానులచేన్, ౮౮౧

కం॥ కృతమునకుం దగుమాదిరి ప్రతికృతియును హింసమునకుఁ బ్రతిహింసనమున్
గృతమైన దోషముండదు, హితము యగును దుష్టు దౌష్ట్యహృతుఁజేఁత కనన్"

వ॥ అనియిట్లు వాక్రుచ్చుటయుఁ భూదేవులు ౮౮౩

తే॥ "అట్టులగుచో ద్విజోత్తమ! యీ పురశ్చరణసమాహ్వయసప్తమి రమణ మీవ
రాకునకు నీవు వాకొను, రమణ దానివలన సంశుద్ధుఁడయ్యెడు వడి నితండు" ౮౮౪

వ॥ అనిపలుకుటయుఁ జండశర్మ యతని కదివచ్చియించె, నతండు దాని నాచ
రించి యొక్క సంవత్సరమునకు గతకల్మషుండయ్యె" ననిన మునులిట్లనిరి, ౮౮౫

ఆ॥ "ఆ పురశ్చరణాభిధమైనయట్టిసప్తమిని నెట్టివేళను సలుపవలయు!
సలుపువేళను దానికి వలసినట్టి విధియదెట్టిది? చెపుమయ్య విస్తరించి" ౮౮౬

వ॥ అని యిట్లు వాక్రుచ్చుటయు సూతుండు ౮౮౭

తే॥ "రోహితాశ్వుఁడడుగ రూఢి నా మార్కండమముని వచించెఁ బూర్వమునను దీని,
నిపుడు మిమ్ముఁగూర్చి యే వచియించెద, వినుఁడు శౌనకాదిమునులు! మీరు, ౮౮౮

వ॥ మార్కండమహామునిని హరిశ్చంద్రకుమారుండగు రోహితాశ్వుండు డగ్గఱి

కం॥ "తెలిసియొ తెలియకయో జన మియ్యిలపై నొనరించుపాప మేమార్గమునన్
దొలఁగంగలదో యించుక తెలుపంగదె సంయమీంద్ర! తేజస్సాంద్రా!" ౮౯౦

వ॥ అనియడుగుటయుఁ మార్కండేయుండిట్లనియె, ౮౯౧

ఆ॥ "మానసిక మొకండు మఱి వాచికము రెండు కాయికంబు మూఁడుగా నఘంబు
మూఁడువిధములుగను భువిలోన జనులకుఁ గలుగుచుండుఁజుమ్ము కాశ్యపీశ! ౮౯౨

కం॥ వాని వినాశనమునకై భూనాయక! మూఁ డుపాయములుగల, వని నీ
కేనువచించెదఁ గర మవధానముతోఁ గూరుచుండి తప్పక వినుమా, ౮౯౩

కం॥ మానసమై యేపాపము మానవులకు సంఘటించు మహిఁ బశ్చాత్తా
పానంతర మదియుండదు క్ష్మానాయక! నిముసమేని సత్యంబిదియా, ౮౯౪

ఆ॥ వాచికంబు వేగపడి యాచరింపక మది విమర్శచేసి మానవుండు
మానుకొనినయెడల మాసెడి నయ్యది యర్కతేజ! రోహితాశ్వరాజ! ౮౯౫

ఉ॥ కాయికపాతకంబు ద్విజకాండమునొద్దకు నేగి చెప్పి యా
ధీయుతు లాజ్ఞయిచ్చినవిధిం గృతనిష్కృతి నైనయొ లేక భూ
నాయకుచే విమృష్టుఁడయి న్యాయ్యపుఁబద్ధతిఁ దత్సుశిక్షితుం
డైనయొ తొలంగఁద్రోసికొననౌను యథార్థముగన్ మహీవిభూ! ౮౯౬

ఆ॥ సిగ్గుచేత ద్విజులఁజేరి వచింపక రాజదండనంబు నోజనొంద
కవఁడు మేననున్న యేనస్సుతోడనే కూలు వానిశిక్షకుండు యముఁడె, ౮౯౭

కం॥ కావునఁ బాపాత్ముఁ డిల జ్ఞానిబుధులనడిగి వారియానతి యెటులో
నావిధిఁ బ్రాయశ్చిత్తము గావించుకొనంగవలయుఁ గడుయత్నమునన్" ౮౯౮

వ॥ అని యిట్లుచెప్పుటయు రోహితాశ్వుండు ౯౯

ఆ॥ "అఖిలపాతకముల నపనయించుటకుఁగా నుపకరించు వ్రతము హోమవిధియొ
దానమో వచింపు దయఁ బురశ్చరణవివర్జితముగ నఘముఁబాయుపాంకె, ౧౦౦

ఆ॥ అనుదినంబుమర్త్యు డఖిలకార్యములలో సలుపు నింతొ యంతొ కలుష మొర్వి
వానికన్నిటికిని వరుసఁ బ్రాయశ్చిత్తమాచరించుకొనఁగ నలవియగునె? " ౧౦౧

వ॥ అనినవిని వెండియు మార్కండేయుండిట్లనియె, ౧౦౨

కం॥ "కలదు పురశ్చరణంబను కలుషఘ్నవ్రత మొకండు, గ్రహపతిహితమై
చెలఁగుఁ బురశ్చరణాహ్వయమిళితంబైనట్టి సప్తమీతిథి యధిపా! ౧౦౩

ఆ॥ ఆచరింపఁబడిన యద్దానిచే మేనఁజెలఁగుచున్నయట్టి చిత్రభానుఁ
డపనయించుఁ బ్రాగ్భవార్జితపాపంబ, యేతదుద్భవాఘు మేమిలెక్క, ౧౦౪

కం॥ కావున నేవాఁడిచ్చిన యీవిధమునఁజేయఁగడఁగుమీ నరనాథా!
తావక దేహమునంగల యావత్కలుషమున ధుతుఁడవయ్యెదు వేగన్" ౧౦౫

వ॥ అనవుడు రోహితాశ్వుండు ౧౦౬

కం॥ యమివర! పురశ్చరణసప్తమి యేవిధిచేతఁజేయవలయునో మఱియున్
శ్రమమన కది సలుపందగు సమయంబెదొ యానతిమ్ము శ్రీవణింతు లలిన్" ౧౦౭

వ॥ నావుడు మఱియు మార్కండేయుండిట్లనియె, ౧౦౮

ఆ॥ "మాఘశుక్లసప్తమీఘస్ర పర్కవాసరసమేతమగుచుఁ బరగునెడల
మకరరాశిలోన మార్తాండుఁడుండఁగా నావ్రతంబుఁజేయనగును రాజ! ౧౦౯

శ్లో॥ పురశ్చరణకృత్యాయాం సప్తమ్యాం దివసాధిప!
ఉపవాసం కరిష్యామి అద్య త్వం శరణం మమ ౧౧౦

తే॥ అనెడిమంత్రంబు జపియించి యరుణుపొడుపుకంటెఁ బూర్వమ పలుదోమి యధిక
బలితపాషండజనములఁ బలుకరింపకుండ నుండంగవలె నాఁ డహో నృపాల! [నిష్ఠఁ

తే॥ అంత నపరాహ్ణసమయమం దధికభక్తి స్నానమొనరించి శుభ్రవస్త్రములుదాల్చి
చిత్రభానుని ప్రతిమను సిద్ధపఱచి దానికిం బూజగావింపఁదగు ధరేశ! ౧౧౨

సీ॥ మఱి పతంగాయ నమయని పాదములను మార్తాండయని జానుమధ్యమునను
దివసనాథాయని దీప్తగుహ్యమునను ద్వాదశాత్మాయని తత్సునాభి
పద్మహస్తాయని బాహువులను దీక్షదీధితేయనుచు హృద్వీథియందుఁ
గమలాభయంచును గంఠంబు తేజోమయాయంచును మస్తకాంతరమున

పాదమాదిగ శీర్షపర్యంత మిట్లు రక్తపుష్పంబులను సమర్చనము చేసి
విధియుతంబుగ ధూపంబు వేసి యవల నెలమిఁ గప్పురహారతి నీయవలయు,

కం॥ ఎఱ్ఱనివసనముచేతను బిఱ్ఱుగఁ జుట్టంగఁబడిన పృథుపాత్రములో
నెఱ్ఱని బెల్లపుటన్నము నొప్పుగ నైవేద్య మవల నొసఁగఁగవలయుఁన్,

ఆ॥ ఎఱ్ఱదారములను నెంతయు వింతగా వత్తిఁ జేసి తైల మెత్తిపోసి
వేడ్కతోడ జ్యోతి వెలిగించి యారాత్రికం బొసంగవలయు ఖ్యాతలేశ!

తే॥ శంఖముననుండి యుదకంబు సంగ్రహించి సఫలమును రక్తచందనసంయుతమును
నాచరించి యథావిధి నర్ఘ్యమీయవలయుఁ దదనంతరంబున వసుమతీశ! ౯౧౭

కం॥ "తెలిసియొ తెలియకొ నాచే సలుపంబడియున్న యట్టి సకలాఘములన్
దొలఁగింపు మర్ఘ్యముంగొని బలుప్రాయశ్చిత్తమిది దివాకరదేవా!" ౯౧౮

కం॥ అనియిటు సూర్యుం బూజితునొనరించి యనంతరమున నుర్వీసురపూ
జన మాచరింపవలయును ఘనముగఁ బుష్పానులేపగంధాదులచే, ౯౧౯

ఆ॥ కుడుకఁ బెట్టి శక్తికొలఁది దక్షిణనిచ్చి తృప్తుఁ జేసి యవనిదేవునిట్లు
పుచ్చుకొనఁగవలయుఁ బో పంచగవ్యంబు కాయశుద్ధికొఱకుఁ గాను దాను

ఆ॥ దోసిలొగ్గియంత నాసూర్యభగవాను వంక నిశ్చలముగఁ బఱపి దృష్టి
వక్ష్యమాణమంత్రపరమును బఠియింపవలయు శోభితాస్యవసుమతీంద్ర! ౯౨౦

శ్లో॥ "ఇదం వ్రతం మయా దేవ గృహీతం పురతస్తవ
అవిఘ్నం సిద్ధిమాయాతు ప్రసాదాత్తవ భాస్కర," ౯౨౧

ఆ॥ మాఘమాసమాది మార్తాండదేవున కావిధమునఁ బూజయాచరించి
ఫాల్గునాది పుష్యపర్యంత మట్లులే చేయుచుండవలయు క్షితిబిడౌజ! ౯౨౨

ఆ॥ కుందకుసుమపూజ గుగ్గులుధూప మన్నము నివేదనంబు విమలగోమ
యంపుఁ బ్రాశనంబు నర్హంబులయ్యెడి ఫాల్గునంబులోనఁ బార్థివాగ్ర్య! ౯౨౩

తే॥ చైత్రమందున సురభిచే జరిపి పూజ గుణిక నైవేద్యమును బెట్టి కోరి సర్జ
రసముతో ధూపమును వేసి రహిఁ గుశోదకమును బ్రాశన మొనరింపఁ గలుగు శుద్ధి,

కం॥ మోదుగుపూలం బూజయుఁ గాదనక నివేదనంబు కలు మాంసంబున్
గా దధి ప్రాశన మొనరిచి యీఁదగు వైశాఖమునను ఘృతధూపంబున్, ౯౨౪

కం॥ కలిగొట్టుపూలచేతను బెలుచన పూజించి పేలపిండి నివేదిం
చి లలిం గపిలాఘృత ముత్కలికం బ్రాశనము చేయఁదగు జ్యేష్ఠమునన్, ౯౨౫

ఆ॥ ఆవిసెపూలఁ బూజ యగరున ధూపంబు విపులధారికను నివేదనంబు
సలిపి ఘృతము మనువా రొలసి నాషాఢమాసమునఁ బ్రాశనంబు జరుపవలయు,

ఆ॥ కడిమిపూలఁ బూజగావించి దగరపుంబొగల నెగయఁజేసి మోదకములు
లలి నివేదనంబు సలిపి గోమయజలాశనము చేయవలయు శ్రావణమున,
తే॥ జాజిపూవులచేతఁ బూజనముచేసి నఖసముద్భూతధూప మెంతయును వేసి
పాలు నైవేద్యమొనరించి భాద్రపదములోనఁ బాలనె శ్రావనాఁ దానుగూడ, ౨౯
తే॥ ఆశ్వయుజమాసమందున నంబుజములఁ బూజ ఘృతపూరి నైవేద్యమును బొనర్చి
కుంకుమంపుఁబువ్వుం బొగకుఁ గవిధించి కప్పురము ప్రాశనముచేయనొప్పు భూప!
కం॥ తులసిం బూజ నివేద్యము కలకండయుఁ బొగకు రమ్యకాసుంభికముఁ
వలయు లవంగప్రాశన మల కార్తికమాసమున మహావీరనృపా! ౩౧
తే॥ గుంటగలిజేరుపూవులు గుడము పేణి వేడ్క నర్చనధూపనైవేద్యములకు
నోలి నుపయోగపఱచి కంకోలభోక్త కావలయు మార్గశిరమున గహ్వరీంద్ర!
కం॥ శతపత్రికచేఁ బూజన మతులితసహజంబు ధూప మల పౌషమునన్
దతశుష్కాలి నైవేద్యం బతిబల! ప్రాశుక్తమెల్లఁ బ్రాశ్యమ్మగుఁబో,
తే॥ ఇట్లు పండ్రెండుమాసంబు లనుభజించి యంతఁ దనయింటనుండిన యర్థమందు
సరిగ నాలవభాగంబు సర్వపాపశుద్ధికై యీయవలయు భూసురున కధిప!
కం॥ తరువాత శక్తికొలఁదిగ ధరణీసురవరుల కన్నదానముగూడన్
జరుపునది, యివ్విధము భాస్కరసప్తమిఁజేయఁ దొలఁగు సకలాఘములున్”
వ॥ అని యిట్లు మార్కండేయుండు రోహితాశ్వునకుం జెప్పినచొప్పునఁ జండ శర్మ పుష్పునకుఁ జెప్పుటయు నతండును దద్వ్రతం బాచరించి నిజగృహంబునఁగల స్వర్ణ రజతంబులను నితరంబులనను నాలవపాలు సమర్పించె, నాపవిత్రభోజనంబు నాగర బ్రాహ్మణులు తిలకించి ౩౬

## —: సూర్యవ్రతమునఁ జండశర్మాదులు బ్రాహ్మనాగరు లగుట. —

ఆ॥ ద్రవ్యలోభమునను దక్కటిభూమిదేవులఁ దిరస్కరించి పుష్పకితఁడు
తానె పెద్దయగుచుఁ బూని ప్రాయశ్చిత్తశుద్ధుఁజేసెఁ జూడుఁ డిద్ధమతులు!
ఉ॥ ఆలవపాలు తద్ధనమునందు గ్రహించినవాఁడుగాన నీ
వీతఁడి బాహ్యభూతుఁడిక, వీనిగృహంబున కేగి యన్నమున్
నీరముఁ బుచ్చుకొన్న మునినీతులఁ జుట్టరికంబుఁజేయు న
వ్వారును నేఁటినుండి కులబాహ్యులుగా గణనీయులెంతయున్”
వ॥ అని సమయంబుచేసి స్వనికేతనంబుల కేగుటయుఁ జండశర్మ పుష్పునుద్దే శించి ౩౯

క॥ "ఈయుర్వీసురులందఱుఁ బ్రాయశ్చిత్తమునకిష్టపడుటనె నీకేఁ
జేయించినాఁడ, నైనను న్యాయమె నను( బతితుఁజేసినారలు వీరల్, ౯౪౦

ఆ॥ కాన మండు నిప్పుకలలోనఁ బడి నేను వేగఁ బ్రాణములను విడుచువాఁడ,
స్వజనులందఱిని విసర్జించి బ్రదుకుట కెంతమాత్ర మింక నిష్టపడను" ౯౪౧

వ॥ అని వాక్రుచ్చుటయుఁ బుష్పుండిట్లనియె, ౯౪౨

ఉ॥ ఇందులకై విచారపడ కీవు ద్విజోత్తమ! భూమిదేవతా
బృందము ద్రవ్యలోభమున నెగ్గొనరించినవారు నీకు, వా
రందఱు నెంతవిత్తమును యాచనచేతురొ యంతయిచ్చి నీ
వొందినయట్టి నింద్యతను శీఘ్రమపాసెద, నీర్ష్యయాపెదన్" ౯౪౩

వ॥ అనియిట్లు వాక్రుచ్చి సత్వరంబుగా బ్రహ్మస్థానంబునకుఁబోయి ౯౪౪

క॥ ధనలోభంబుననీరలు ననుఁగూరిచి చండశర్మనామకుపై నిం
దను మోపితి, రటుగావునఁ గొనుఁడీ ధనమిత్తు మీరుకోరినయంతన్" ౯౪౫

వ॥ అనుటయు నాగరబ్రాహ్మణు లెల్లరుం గను లెఱ్ఱఁజేసి ౯౪౬

క॥ "ఛీ ఛీ పాపాత్మా! నీ వాచాదోషమున జిహ్వ వ్రయ్యలగును బో,
మ్మా చండశర్మ సవిధిగఁ బాచితమొనరింపకునికి బాహ్యుండయ్యెన్, ౯౪౭

క॥ ఒక్కఁడె ప్రాయశ్చిత్తము నిక్కముచు నొనరించి యితఁడు నింద్యుండయ్యెన్,
బెక్కురు బ్రాహ్మణులకుఁగా నొక్కనికిం బాచితంబు నొనరుపవశమే, ౯౪౮

ఆ॥ ఈయకార్యమునకు నెల్లపురాణముల్ స్మృతులు ధిక్కృతమ్మొనరించెత,
విత్తమునకు నితని వెలిచేయ దానికి మొగమువాయలేదు మూఢ! పొమ్ము.

క॥ ప్రాయశ్చిత్తము నలుగురుధీయుతులను గలిపికొని విధింపఁగవలెనం
చాయా స్మృతులు వచింపఁగఁ జేయించెనితం డొకండె శ్రేష్ఠుఁడననుచున్,

ఆ॥ కాన యుష్మదీయకల్మషమంతయు వచ్చి యితనియొడలు చొచ్చెనిపుడు,
దానఁజేసి మేము పూని బహిష్కారమును విధించినాము చనుమిఁకీవు, ౯౫౧

వ॥ అనివచించి స్వనికేతనంబులకుఁ జనుటయుఁ బుష్పుఁ డింటికేగి

క॥ "ఎందాఁక సాహసింపదో యందాఁకం బ్రజకు సిద్ధి యలవడ, దటుగా
నం దద్ద సాహసించెద నెందుఁ గృతఘ్నుతను స్థానమేర్పడకుండన్" ౯౫౩

వ॥ అనినిశ్చయించి సప్తమీభానువాసరంబురాఁ బుష్పాదిత్యునకు నూటయెని
మిది ప్రదక్షిణంబులొనరించి నిజాంగంబులు శస్త్రంబున ఖండించి వీతిహోత్రంబున
వ్రేల్చి కాయశేషంబుచేఁ బూర్ణాహుతిం బొనరింపఁబోవుటయుఁ బూష ప్రత్యక్షమై

ఆ॥ "వృష్ణ! సాహసమును బొనరింపకోయి నీయెడఁ బ్రసన్నుఁడైతి నిపుడు నేను,
మరల నీకు నేమికలయునో చెప్పుకొ, మ్మిచ్చిపోవువాఁడ నీహితమును" ౯౫౫
వ॥ అనివాక్రుచ్చుటయుఁ బుష్పుండిట్లనియె, ౯౫౬
తే॥ "క్ష్మాసురశ్రేష్ఠుఁడైనట్టి చండశర్మ నాగరబ్రాహ్మణులచేత నానిమిత్త
మై బహిష్కృతుఁడయ్యె, నాయనను వారితో సమానునిజేయుము మోతోయజాప్త
తే॥ శాస్త్రముంజూచియే నాకు శ్రద్ధతోడఁ బాచితంబొనరించె నాబ్రాహ్మణుండు,
అట్టులైనను వెలిపెట్టి రకట యతని నందఱుంగూడి యసహిష్ణులగుచువారు"
వ॥ అనవుడు సూర్యభగవానుండు ౯౫౯

తే॥ "నాగరబ్రాహ్మణులం దొక్కఁడే గరిష్ఠుఁ, డతనినుడి కన్యథాచేయ నలవిగాదు,
అందఱును నేకమై పల్కినట్టిమాట యన్యథాయాచరింపంగ నగునె వశము, ౯౬౦
ఆ॥ అగునుగాక, యీతఁ డవని బ్రాహ్మణుండన ఖ్యాతినంది కరము పూతుఁడగును,
నితనిసుతులుగూడ నెంతయు విఖ్యాతి రాజమాన్యులగుచు రాజిలుదురు,
ఆ॥ ఇతనిచుట్టములును హితులును నిట్టిరే యై చరించువార లవనియెల్ల,
మత్ప్రసాదమునను ద్వాత్ప్రత్యవయసము నవ్రణంబగును ధరామరేంద్ర!" ౯౬౧
వ॥ అనిపలికి యంతర్ధానంబుఁజెందుటయుఁ బుష్పుఁ డక్షతాంగుండై చండశర్మ
యింటికరిగి విషణ్ణవదనంబుననుండు నతని విలోకించి ౯౬౩

## —: నాగరేశ్వరోత్పత్తి: —

ఆ॥ "నీనిమిత్తముగను నేఁ దనుత్యాగంబుజరుపుటకునుగూడ సమ్మతించి
సరసిజాప్తు సుప్రసన్నుని గావించుకొన్నవాఁడ, మెప్పుగన్నవాఁడ, ౯౬౪
శా॥ నీపాతిత్యము తత్కృపాబలముచే నేడేఁ తొలంగుంజుమీ,
నీపుత్రుల్మొదలైన నీకులజులున్ నిర్భీతి యీనాగర
క్ష్మాపీయూషభుగాళికంటె ఘనులై సంతుష్టినుం, డందుచే
నా పుణ్యంపు సరస్వతీనదితటంబందుండు లేలెమ్మికన్ ౯౬౫
ఉ॥ ఉండుట కొక్కయాశ్రమము యోగ్యముగన్ రచియించి యందు నీ
యండను నేన యుండఁగల, నగ్గలపున్ ధనముండెనాకు, నీ
దండవసించునందఱిని దప్పక పోషణసేతుఁ గాన నీ
యుండిన మానసజ్వరము నో ద్విజవర్య! త్యజింపుమీ యికన్" ౯౬౬
వ॥ అనిన విని చండశర్మ పుత్రపౌత్రబంధుసమన్వితంబుగా నగరంబుఁజుట్టివచ్చి
నమస్కరించి కనులవెంట నీళ్ళుగార్చుచుఁ బుష్పుంగూడి యుత్తరాభిముఖంబుగం

బోయి సరస్వతీ దక్షిణతీరంబున బంధువులుం దానును నివసించి, రాయనకు నగరమున నుండునప్పు డిరువదియేడులింగంబుల నీక్షించినం గాని భుజింపనని దీక్షయుండెడిది, దాని స్మరించి రేయింబవళ్ళును హృదయంబు దహింపంబడ సరస్వతీనదిని స్నానమొనర్చి నమోంతంబుగాఁ బ్రతిలింగంబు పేరుం జెప్పుచు వేఱువేఱ షడక్షరమంత్రంబు జపించుచుఁ బ్రత్యహంబును బంచాంగుళశతకర్దమంబున నిరువదియేడులింగంబు లొనరించి పుష్ప ధూపానులేపనంబులం బూజించి దుస్థితమైనను సుస్థితమైనను శివలింగము కదలింపఁగూడ దని వానిమీఁదనే మఱువాఁడు సప్తవింశతిలింగంబులు సంస్థాపింపఁ గొంతకాలంబునకు నర్ధపర్వతంబగుటయు నతనిభక్తికి శివుండు సంతుష్టుండై భూమిం బగుల్చుకొని లింగ రూపంబున దర్శనం బిచ్చి ౯౬౭

ఆ॥ "చండశర్మ! నీదుభక్తికిని మెచ్చుకొనినవాఁడఁ బ్రీతి నెనసినాఁడఁ,
గాన నేటినుండి కడుశ్రద్ధ నీలింగములకు విధియుతముగఁ బూజజరుపు, ౯౬౮
తే॥ సప్తవింశతిలింగముల్ శ్రద్ధతోడఁ బూజసేయంగఁ గల్గెడి పుణ్యఫలము
గలుగునీ, కన్యులైనను గలుషనిటు కలుగుఁ దత్ఫల, మింక నేమిగలదు చెప్పు"

— • పుష్పుండు నాగరాదిత్యుఁ బ్రతిష్ఠించుట • —

వ॥ అని యదర్శనంబుఁ జెందుటయుఁ జండశర్మ తల్లింగంబున కాలయంబుగట్టించి నగరస్థలింగంబుల ప్రతికృతియగుట నాగరేశ్వరాఖ్య నర్పించి పెద్దకాలంబునకు విమా నారూఢుండై శివలోకంబుఁ జేరెఁ, బుష్పుండును దత్తీరంబునం దాదిత్యుఁ బ్రతిష్ఠించి పూజించి యాదేవుండు దర్శనమిచ్చి వరంబు నేఁడుమనుటయు ౯౭౦

తే॥ ఆల చమత్కారపురమునం దలరునట్టి నీకు పన్నెండుమూర్తులు నిర్జరులకుఁ
బూజ్యములు, వానిఁబూజించి పొందుఫలము పొందవలె నీ భవన్మూర్తిపూజకుండు,
తే॥ ఆలయంబునుగట్టించి యందు నగరసంస్థితములకుఁ బ్రతికృతిసలిపియుంటి,
వీన నీమూర్తి నాగరాదిత్యసంజ్ఞ ఖ్యాతినందునుగాక లోకమున దేవ!" ౯౭౧

వ॥ అనిప్రార్థించుటయు నాదేవుండు వల్లెయని యంతర్హితుండయ్యె, నంతఁ బెద్ద యుం బ్రొద్దునకుఁ బుష్పుండును విమానమధిరోహించి సూర్యలోకంబునకరిగె" ననవచించుటయు

కం॥ విద్వత్కవితాదినిఖిల సద్విద్యావద్ద్విజాగ్ర్యసముదాయమహా
హృద్వాంఛాసంపూరణగద్వాలాద్యవనిపాలక ప్రతిమవిభూ! ౯౭౪

గద్య॥ ఇది శ్రీ...జానపాటి పట్టాభిరామాభిధానసమాంధ్రీకృతంబగు
స్కాందమహాపురాణాంతర్గత నాగరఖండంబున షష్ఠాశ్వాసము.

ఈసంచికకు అనుబంధము.

దయచేసి

మీమిత్రులకు చూపి ప్రోత్సాహము చేయుడు.

# తైత్తిరీయస్మార్తబ్రాహ్మణ నిత్యకర్మాష్టకము.

## విద్యారణ్యభాష్యము ననుసరించి వ్రాయబడిన

టీకాతాత్పర్య స్వరసహితము.

గాయత్రిరంగులపటములో సాదా అట్టబైండు ౨-౮-౦

డిటో మేలుబైండు ౩-౦-౦ డిటో లైబ్రరీయడిషన్ ౪-౦-౦

ఇదివరకు ౪౦౦౦ గ్రంథములు సెలవైనవి. (౩ వ కూర్పు ఇప్పుడే సిద్ధమైనది.)

పీఠికయందు ౪౮ సంస్కారములుగూర్చియు ౪ వేదములను షడంగములగూర్చియు, సంవత్సర, ఋతు, మాస, పక్షతిథి, నక్షత్రములనుగూర్చియు సప్రమాణముగ వివరింపబడియున్నది సంధ్యావందన, ఔపాసన, వైశ్వదేవ, బ్రహ్మయజ్ఞ, దేవతార్చన, అతిథిపూజాదుల వివరమంతయు ధర్మశాస్త్రప్రమాణములతో సతాత్పర్యముగ నిందు వ్రాయబడియున్నది.

దీనియందుగల కొన్ని ముఖ్యవిషయములను వ్రాయుచున్నాడను:—

౧. శ్రుతిస్మృతి పురాణాచమనవివరణము
౨. ప్రాణాయామముచేయవలసినరీతి
౩. సంకల్పవివరణము
౪. సంవత్సర, అయన, ఋతు, మాస, తిథి, నక్షత్ర, యోగ, కరణ, వివరము
౫. స్నానప్రకరణము
౬. త్రికాలసంధ్యావందనము
౭. వస్త్రధారణవిధి
౯-౧౦ ఊర్ధ్వపుండ్ర భస్మధారణవిధులు
౧౧. బ్రహ్మచారులు చేయవలసిన కార్యము
౧౨. గృహస్థులుచేయవలసినఔపాసనవిధి
౧౩. ప్రాయశ్చిత్తోపాసనము
౧౪-౧౭ సమిదాధాన, సమిధారోపణ, సమస్యపక్షహోమాదికము
౧౮. బ్రహ్మయజ్ఞప్రకరణము
౧౯. బోధాయనసూత్రోక్తదేవతార్చనము
౨౦. పురుషసూక్తవిధానదేవతార్చనము
౨౧-౨౭ సూర్య, గౌరీ, కృష్ణ, శివ, గణపతి, రామాష్టోత్తరశతనామములు
౨౭-౨౮ వైశ్వదేవము అతిథిపూజ
౨౯-౩౦. సాలగ్రామ, శంఖ, తీర్థప్రాశనవిధి
౩౧. గురుధ్యానము
౩౨. సూర్యోపస్థానవిధి

# ఆబ్దికమన్త్రములు.

## సస్వరాంధ్రప్రయోగము, టీకాతాత్పర్యసహితము. వెల ౧-౪-౦

విద్యారణ్యభాష్యము ననుసరించి వ్రాయబడిన టీకాతాత్పర్యములుగలది బ్రాహ్మణులందఱకు అత్యావశ్యకములగు ధర్మశాస్త్రవిషయము లనేకములు పరిశీలించి సప్రమాణముగ వ్రాయబడినది.

శ్రాద్ధభేదములు, ఉపవీత ప్రాచీనావీతనిమిత్తములు, నిమంత్రణవిధి, నిమంత్రణార్హబ్రాహ్మణులు, శ్రాద్ధమునందు వాడతగినకూరలు, ఫలములు, తగనికూరలు, స్త్రీలు మున్నగువారలు శ్రాద్ధము పెట్టవలసినప్పుడు చేయవలసినరీతి, కర్త తెలుసుకొనదగిన విషయములు, భోక్త తెలుసుకొనదగిన విషయములు, పితృపాకశేషభోజనము, శ్రాద్ధాంగతర్పణము మున్నగునవి వివరముగ తెలుపబడినవి. శ్రాద్ధవిధానము వైదికము కాదనెడివారి వాదమింతు నిరాకరింపబడినది అన్నసూక్త, అభిశ్రవణ, పురుషసూక్త, ప్రాయశ్చిత్తోపాసన, ఔపాసన, సమిధారోపణాది సకలవిషయము లనేకము లింకగలవు.

౩. తీర్థశ్రాద్ధమహాలయవిధులు:—సస్వరాంధ్రప్రయోగము ౦ ౧౨-౦
పైరెండుగ్రంథములుకలిపి కలికోబైండుచేసినది ౨-౪-౦

౪. సూర్యనమస్కారమంత్రములు:—ఋగ్వేదాంతర్గత మహాసౌరసూక్తసమన్వితము. ఐహికాముష్మికములయందు ప్రత్యక్షఫలప్రదములయి అందఱిచేతను "ఆరోగ్యం భాస్కరాదిచ్ఛేత్" అను ప్రమాణము ప్రత్యక్షఫలముగా అనుభవింపబడుచున్న యీమంత్రసమూహము అందఱకు అత్యుపయోగము. వెల ౦-౮-౦

౫. విఘ్నేశ్వరపూజా పుణ్యాహవాచనములు:—సస్వర, ఆంధ్ర టీకాతాత్పర్యసమన్వితములు, విష్వక్సేనపూజనయుగలను. వెల ౦ ౮-౦

౬. మంత్రపుష్పత్రయము:—దేవాలయాదులయందున్నూ, బ్రాహ్మణసభలు చేరినతావులయందున్నూ తప్పక అందరిచేత తింపబడుచున్న "౧. సహస్రశీర్షం దేవం; ౨. యోపాంపుష్పంవేద; ౩. జాతవేదసే సునవామసోమం" అను ఈ౩ మంత్రపుష్పములయందు యెంతయో గూఢాభిప్రాయ మిమిడియున్నది. భగవంతునియొక్క విరాట్పురుష విభూతివర్ణనము, ఉపాస్యస్థలవిశేషవర్ణనము, సకలవిధదేవతాస్వరూపవర్ణనము, సృష్ట్యాదియందుగల భగవద్విభూతివర్ణన మెంతయో వర్ణింపబడినది. ఇట్టిమంత్రములయర్థమెఱింగి పఠించిన కలుగు హృదయానందము అనుభవైకవేద్యము. ౦-౪-౦

౭. **సంధ్యావందనము:**—ఆచమన, ప్రాణాయామ, సంకల్పములనుగూర్చి అతివిపులముగ పీఠికయందు దాదాపు ౧౬ పుటలయందు వివరింపబడియున్నది. మూలము ఆత్మవిద్యావిలాసమున్నుగలదు. వెల ౦-౪-౦

౮. **సదాచారము:**—సాంధ్రతాత్పర్యము. సూర్యోదయమున లేచినది మొదలుకొని రాత్రిశయనించువరకు చేయవలసిన సకలవిధులు, ధర్మశాస్త్రవైద్యశాస్త్ర ప్రమాణ వచనములతోడను, ఆయావిషయముల నాచరించుటవలన కలుగు మేలు, లేదిదానివలనకలిగెడుకీడు మున్నగునవి సుస్పష్టముగ ఇందు వివరింపబడినవి. దాదాపు ౨౦ దేవతలయొక్క ప్రాతస్స్మరణశ్లోకములు, దంతధావనకాష్ఠములు. తద్గుణములు. స్నానార్హజలవిచారము. భోజ్యాభోజ్యపదార్థవిచారము మున్నగు ౫౦ విషయములుగలవు. సౌరసూక్తములు, రాత్రిసూక్తము. గణపతి. బృహస్పతి. విష్ణుసూక్తములు ఆత్మయజ్ఞము మొదలగునవి తాత్పర్యసహితముగ గలవు. వెల ౦-౮-౦ కలికోబైండు ౧-౧౨-౦

౯. **స్నానమంత్రములు:**—ప్రతిపదాంధ్రటీకాతాత్పర్యసమన్వితము ౦-౩-౦

౧౦. **సహధర్మిణీచర్య:**—టీకాతాత్పర్యసమన్వితము. వాత్స్యాయనకృత కామశాస్త్రమునందుండి సంగ్రహింపబడినది. స్త్రీలు వారిప్రవర్తనము, వారు చేయవలసిన గృహపరిపాలనము, దాసదాసీజనములయందు భర్తృబంధుమిత్రాదులయందు మెలగవలసినరీతులు మున్నగునవి గలవు. ౦-౪-౦

౧౧. **పైతృమేధికప్రయోగము:**—ధర్మశాస్త్రకారికాసమేతము. యజుర్వేదపైతృమేధకర్మకు సంబంధించిన విషయమంతయు ఉటంకింపులులేకుండా అన్నివిషయములు తేటగా దీనియందు వివరింపపడియున్నవి. ౨-౮-౦

౧౨. **ఋగ్వేదాపరప్రయోగము:**—సస్వరము ౧-౮-౦

౧౩. **నిత్యకర్మాష్టక పరిశిష్టము:**—సముద్రస్నానవిధి, సూర్యనమస్కారమంత్రములు, సూర్య చంద్ర గ్రహణహోమములు మున్నగు ౧౦ విషయములు సస్వరాంధ్ర ప్రయోగముగ ఇందు వివరింపబడియున్నవి. ౦-౪-౦

౧౪. **సనత్సుజాతీయము:**—శంకరభాష్యాంధ్ర టీకాతాత్పర్యములుగలది. సనత్సుజాతులవారు ధృతరాష్ట్రునకుపదేశించిన తత్త్వోపదేశమిందుగలదు. ౧-౦-౦

౧౫. **లావణ్యమయి:**—సులభశైలిలో వ్రాయబడిన సంస్కృతనవల. ౦-౪-౦

౧౬. **సర్వవేదాంత సిద్ధాంతసారసంగ్రహము:**—శంకరాచార్యకృత వేదాంతగ్రంథరాజము ఆంధ్రటీకాతాత్పర్యసమన్వితము. ౨-౮-౦

౧౭. **ఆర్యధర్మప్రత్యక్షఫలబోధిని:**—నిద్రలేచినదిమొదలు రాత్రిశయనించువఱకు మనముచేయవలసినవిశాస్త్రములందు విధించిన ఆహ్నికవిధులవలన మనకు గలుగు ఆరోగ్యభాగ్యము మున్నగు సకలవిషయములు యుక్తియుక్తముగ సప్రమాణముగ తేటతెలుగుతో తెలుపబడినది. ౧-౦-౦

# ౧౮. కైవల్యనవనీతము.

కనుపర్తి. వేంకటరామ శ్రీవిద్యానందనాథ విరచితము.

టీకాతాత్పర్య విశేషార్థసమన్వితము. ౫-వ ముద్రణము.

| | | |
|---|---|---|
| తత్వబోధప్రకరణమను మొదటిభాగము కలికోబైండు | | ౨-౮-౦ |
| సందేహనివారణమను రెండవభాగము | ,, | ౨-౦ ౦ |
| రెండుభాగములు చేర్చిన ఒకేసంపుటము | ,, | ౪-౦-౦ |

స్త్రీలు, బాలురు సాధారణ జనులుకూడ గ్రహించతగినంతటి సులభశైలిలో బ్రహ్మసూత్రములు, గీతాభాష్యము, ఉపనిషత్తులు మున్నగు వేదాంతగ్రంథ సముద్రమునుమథించి సకలవిషయములు మొదటిప్రకరణమునందు తత్త్వబోధమనుపేరుతో మనస్సునకు నాటుటకయి దృష్టాంతరూపములగు కథలతో బోధింపబడియున్నవి. వేదాంత గ్రంథములందింత ప్రచారముగల గ్రంథరాజము మఱొకటిలేదు ఇట్టి యత్యుపయోగ గ్రంథమగుటచేత ఇదివఱకు ౪పర్యాయములు ముద్రింపబడి ౮౦౦౦ (ఎనిమిదివేల) గ్రంథములు లోకమున వ్యాపించియున్నవి. దారేషణ, ధనేషణ, పుత్రేషణ మున్నగువిషయములనుగూర్చియు, శ్రీచక్రనగర వర్ణనమునుగూర్చియు, మహావాక్యములనుగూర్చియు వ్రాసినవివరముచదువుటకు హృదయంగమమైయుండును.

సందేహనివారణమను రెండవభాగమునందు ఆచార్యుఁడు తత్త్వబోధజేసినతర్వాత ఆయుపదేశించినవిషయమును శిష్యుఁడుమననముచేయుచుండగా అతనిబుద్ధికి తోచిన సందేహములను ఆచార్యుఁడు నివారించుటయే ప్రధానవిషయము.

౧౯. **త్రివర్గప్రదీపిక:**—ధర్మకాండ, అర్థకాండ, టీకాతాత్పర్య విశేషార్థములుగలది. 'కురళ్' అనుగ్రంథమునకు తెలుగు భాషాంతరీకరణము. 3-౮-౦

డిటో అర్థకాండముమాత్రము ౨-౦-౦

౨౦. **గోత్రప్రవరసంగ్రహము:**—బ్రాహ్మణవంశమునందు జన్మించినవారందఱకు గోత్రములనుగూర్చియు ప్రవరలనుగూర్చియు తెలిసికొనుట అత్యావశ్యకము. వేయేల? యీవిషయము నెఱుంగనివానిని బ్రాహ్మణుఁడని సాధారణముగ చెప్పఁజాలము. గోత్రములననేమి ? ప్రవరలనన యేమి ? గోత్రఋషులకు ప్రవరఋషులకుగల సంబంధమేమి? యేయేగోత్రములవారేయేగోత్రములందు జన్మించినవారినిపరస్పరము వివాహసంబంధముచేసికొనగూడదు. మున్నగు అనేకవిషయములు సప్రమాణముగ నిందుగలవు. ఆపస్తంబ, బోధాయన, ఆశ్వలాయన, వైఖానస, కాత్యాయన, లోగాక్షి, హిరణ్యకేశీయ, గృహ్యసూత్రములను, మత్స్యపురాణమును అనుసరించి దాదాపు 3 వేల గోత్రములయొక్క గోత్రప్రవరలు వివరముగా ఏయేసూత్రములందెట్టుల చెప్పినదియు తెలుపబడియున్నది. కొద్దిగ్రంథములే నిలువయున్నవి. ౦-౮-౦

# త్రికాల సంధ్యావందనము.

టీకాతాత్పర్య స్వరసహితము గాయత్రిపటములతో వెల ౦-౬-౦

ఆచమన, ప్రాణాయామవివరము. ఆశౌచము, రోగము, దేశవిప్లవము మున్నగుసమయములందు సంధ్యావందనమెట్లు చేయవలయును. మున్నగుఅనేకవిషయములు చక్కగ ఇందు వివరింపఁబడియున్నవి.

**౨౨. ముప్పదియిద్దరు మంత్రుల చరిత్రము:**—ఆంధ్రదేశమునందు మంత్రులై శౌర్య, వితరణ, ధైర్య, సాహసములందు వాసిగాంచిన మహాత్ములయొక్క చరిత్రము ఇందు ఆయాసందర్భములందు కవీశ్వరులు ఆమంత్రులనుగూర్చి చెప్పినపద్యములు దాదాపు ౨౦౦గలవు. ఒక్కొక్క పద్యము లక్షవరహాలవెలగలది. పీఠికయందు మంత్రిమానాడు కట్టుబాటును సంబంధించిన శాసనములు ౩ ప్రకటింపబడియున్నవి. ఆకాలమునాటి దేశస్థితిగతుల నెరుంగుటకు ఇవి చాలాయుపయోగించునని పలువురుకోరగా ఇందుచేర్చితిమి. ౦-౧౨-౦

## దీనియందీపేరులుగల మంత్రుల చరిత్రముగలదు.

౧. రాచనభాస్కరమంత్రి. ౨. రాయనకొండభాస్కరమంత్రి. ౩. రామలింగభాస్కరుడు. ౪ గోపరాజురామప్రధాని. ౫ కరణం మల్లమంత్రి. ౬ బండారుకేతమంత్రి. ౭ సేదమయాజిమంత్రి. ౮ నాదెండ్లఅయ్యలయ్య ౯ రణతిక్కనమంత్రి. ౧౦ కోటసింగరాజు. ౧౧ నిట్టలహరిమంత్రి. ౧౨ కొట్ట ఎఱ్ఱమంత్రి. ౧౩ గుండయ్యమంత్రి. ౧౪ సింగనమాచమంత్రి. ౧౫ సాహిణిమారమంత్రి. ౧౬ మామిడి సింగమంత్రి. ౧౭ కొరవిమన్నామాత్యుడు ౧౮ పెమ్మయసింగరాజు. ౧౯ నందూరి భీమనగుండమంత్రి. ౨౦ పైడిగంటువిస్సమంత్రి. ౨౧ తిమ్మరుసు. ౨౨ బెండపూడి అన్నమంత్రి. ౨౩ చేమకూర అప్పరాజు. ౨౪ విట్టలవెఱ్ఱమంత్రి. ౨౫ గుంటుపల్లి ముత్తరాజు. ౨౬ గుంటుపల్లి నరసింగమంత్రి. ౨౭ నందితిమ్మనమంత్రి. ౨౮ కూరగాయల రామమంత్రి. ౨౯ వాకిటితిమ్మమంత్రి. ౩౦ కటికికామన్నమంత్రి. ౩౧ మోటుపల్లి శరభమంత్రి. ౩౨ బందాపరదేశిమంత్రి.

**౨౩. శ్రీచక్రనగర వర్ణము, వచనము:**—దూర్వాసమహర్షికృతమగు లలితాస్తవరత్న మను గ్రంథము ననుసరించి తేటతెలుగు వచనమునందు వ్రాయబడినది. ఈగ్రంథమునందు శ్రీ త్రిపురసుందరియొక్క నగరమును, ఆనగరముయొక్క ఇనుము, ఉక్కు, సీసము, ఇత్తడి, రాగి, కంచు, వెండి, బంగారము, నవరత్నములు మొదలగు వానితో నిర్మింపబడిన ౨౫ ప్రాకారములు, ఆయాప్రాకారములందుగల ఉద్యానవన

ములు, సరోవరములు, ద్వారపాలకులు విహారభవనములు మొదలగువాని వర్ణనముగలదు. ఇట్టివర్ణనము ఏకావ్యమునందును ఏప్రబంధమునందును వర్ణింపబడియుండలేదు. శ్రీమత్త్రిపురసుందరి, శివకామసుందరులయొక్క వర్ణనముగలదు. లలితాస్తవరత్నము ౨౧౨ శ్లోకములును, శ్యామలా నవరత్నమాలికయు చేర్పబడియున్నవి. ౦-౮-౦

**౧౪. మనోవికాసము, వచనము:**—మనస్సనగేమి? మనోవృత్తులన నెట్టివి? వాసనయన నేమి? లోకవాసన శాస్త్రవాసన దేహవాసన యను వానివివరములు. దైవీసంపద ఆసురీసంపద యను వానివివరములు చాలసులభశైలిలో అందఱకు తెలియువిధముగ సప్రమాణముగ వ్రాయబడినవి. ౦-౩-౦

**౧౫. శాస్త్రీయసంస్కారావశ్యకత:**—మనుష్యుడు జన్మించిన పిదప అతనికి కొన్నివిషయములు చేయవలయునని శాస్త్రములందు చెప్పబడియున్నవిగదా? వానిని యేలచేయవలయును. చేయనియెడల యేమిదోషము? మొదలగు విషయములు శ్రుతియుక్తి అనుభవములతో తేటతెల్లముగ యిందువ్రాయబడియున్నవి. ౦-౫-౦

**౧౬. కొండవీటి సీమదండకవిలె, వచనము:**—గోపరాజు రామప్రధాని గారు ఆంధ్రదేశమునందు ఏయే గ్రామకరణీకుమిరాశిని ఎవరికిఒసంగినదియు ఇందు వివరింపబడియున్నది. మనపూర్వదేశ ఆంధ్రచరిత్రమునకు సంబంధించిన ఈగ్రంథము ఆంధ్రులందఱకును అత్యావశ్యకమయినది. ౦-౬-౦

**౧౭. వేదాంతచంద్రిక:**—తేటతెలుగువచనము. ప్రథమభాగము. ౦-౮-౦

పరబ్రహ్మము చిత్స్వరూపమనియు, బుద్ధ్యాదిసకలజగత్తు జడమనియు, అనువిషయమును యుక్తిచేతను శ్రుతిప్రమాణముచేతను స్థాపించియున్నారు బృహదారణ్యకమునందు జనకునకు యాజ్ఞవల్క్య డుపదేశించిన ఆత్మ స్వయంప్రకాశ రూపమును. ఛాందోగ్యమునందు ఉద్దాలకుడు శ్వేతకేతువున కుపదేశించిన సత్స్వరూపనిర్ణయము, ప్రజాపతి ఇంద్రవిరోచనుల కుపదేశించిన అక్షివిద్యను మఱియు మాండూక్యగౌడపాదకారికా కేనోపనిషదర్థ రహస్యనిర్ణయములతో, ౧. ఆత్మస్వప్నమందు స్వయంప్రకాశము, ౨. జాగరమందును స్వయంప్రకాశము, ౩. సుషుప్తియం దాత్మచైతన్యము లోపింపదు, ౪. అవస్థాత్రయమందు ఆత్మయసంగుడు. ౫. స్వప్నజాగరసుషుప్తులతెలిసికొనెడిదానికంటె విలక్షణమైనదే ఆత్మ. ౬. శరీరబుద్ధీంద్రియములు ఆత్మకావు అను విషయములుఅనేకయుక్తులతో శ్రుతిప్రమాణములతో శాస్త్రీయముగ నిందుతెలుపబడినది. విషయము శాస్త్రీయమైనను సుబోధముగ తెలుపబడినది.

**౧౮. మతదర్పణము:**—చార్వాక, జైన, బౌద్ధ, కాపాలాది అవైదికమతములనుగూర్చియు అద్వైత ద్వైతాది వైదికమతములగూర్చియు వ్రాయబడినది. ౦-౪-౦

**౧౯. ఆర్యవిద్యారహస్యము, వచనము:**— భరతఖండమునందు సుప్రసిద్ధినందిన ౪ వేదములు, ౬ అంగములు, ౧౮ పురాణములు, ౬౪ కళలు మున్నగువిద్యాస్థానములనుగూర్చి వ్రాయబడినచరిత్ర. ౧-౦-౦

# వేదభూమి.

మనదేశాభిమానమును, పౌరుషమును, సమూలముగ నశింపజేయుఁదలయునను తలం పుతో "ఆర్యు లిచటివారుకారనియు, వారు మధ్యాశియాఖండమునుండి యిచటికివచ్చి ఆదిమనివాసులజయించి లోబఱుచుకొని యిచ్చట నిలిచిపోయిరనియు" విదేశీయులు కొందఱు వ్రాయగా దానినే పాఠశాలలయందు బోధించుచు విదేశీయులున్నారు. ఈ యపసిద్ధాంతమును సప్రమాణముగ ఖండించుచు మనయీయార్యావర్తమే రార్యాజన్మ భూమియని యిందు సిద్ధాంతరీకరింపఁబడినది. ఇంగ్లీషు చదివిన మనపెద్దలకు పలువురకు మనపూర్వుల వ్రాతలకంటె విదేశీయులవచనములందే ప్రమాణబుద్ధియుండుటచేత మే మీగ్రంథమున విశేషించి విదేశీయులవ్రాతలనే ప్రమాణముగ గ్రహించితిమి. ౧ ౪-౦

౩౧. **వైదికధర్మచరిత్రము, వచనము:**—సృష్ట్యాదినుండి నేటివరకుగల వైదికధర్మముయొక్క సంగ్రహచరిత్రము, శ్రీ శ్రీ శ్రీ జగద్గురుకళ్యాణానంద భారతీ మాంతాచార్యస్వామివిరచితము. ౦-౪-౦

౩౨. **పాండవగీతలు:**—ఆంధ్రటీకాతాత్పర్య పద్యసమన్వితము. ఒక్కొక్కశ్లో కము చదువునప్పుడు చిత్తము తన్మయత్వమును చెందుచుండును. ౦-౧౦-౦

ఈగ్రంథమునకు 'ప్రసన్నగీతలు' అని నామాంతరముగలదు. పాండవులకాలము నందు భూభారము తీసివేయనవతరించిన శ్రీకృష్ణభగవానునిగూర్చి పాండవులకు సంబం ధించిన భీష్మ, ధర్మరాజ, భీమార్జున, నకుల, సహదేవ, అభిమన్యు, సాత్యకి, విరాట, ద్రు పద, ధృతరాష్ట్ర, దుర్యోధన, కర్ణ, సంజయ, విదుర, ఉత్తర, దృష్టద్యుమ్న, ఘటోత్క చ, సంజయ, ఉత్తర, అక్రూర, కృతవర్మ, వికర్ణ, సోమదత్త, కళింగ, భూరిశ్రవాదులును ధౌమ్య, ద్రోణ, కృప, అశ్వత్థామాదులును, ప్రహ్లాద, నారద, పరాశర, పుండరీక, వ్యాస, అంబరీష, శుకశౌనకాదులును, కశ్యప, అత్రి, భరద్వాజ, విశ్వామిత్ర, గౌతమ, జమదగ్ని, వసిష్ఠాదిమహర్షులును, సుభద్రా, ద్రౌపది, కుంతీ, గాంధారీ, అరుంధతి మున్నగుపతివ్రతా త్నములును దాదాపు ౧౦౦ భక్తులు శ్రీకృష్ణభగవానునిగూర్చి తమతమగల యభిప్రాయ ములను ప్రసన్నులయి విన్నవించిరి.

౩౩. **సప్తపదులు:**—ఆండాళ్ దేవి పాయించిన తిరుప్పావై యను అరవపా శురములకు తెలుగుపాటలు. సరసమనోహర కవితారసప్రదర్శనమంగు నెరజాణరైరి "రా ధికాసాంత్వన" మను శృంగారప్రబంధమునురచించిన ముద్దుపళనియను స్త్రీరత్నము ౧౦ పాశురములను, సరసకవితారచనయం దారితేరిన బ్ర॥ వే॥ ప్రభాకరశాస్త్రిగారు ౨౦ పాశురములను తెలిగించిరి. అరవగ్రంథమును రచించిన ఆండాళ్ దేవి ధనుర్మాసా రంభదినము మొదలుకొని ౩౦ రోజులవరకు ఒక్కొక్కపాశురముచేత శ్రీకృష్ణభగవానుని కొనియాడి శ్రీకృష్ణానుగ్రహముపొంది శ్రీకృష్ణపరమాత్మనుభర్తగాపొందెను. ౦-౪-౦

౯ రాచూరి సుబ్బయ్యగారు - శ్రీ శ్రీ విరూపాక్షసంస్థాన ప్రధానమంత్రి

౧౦ ఘంటంభట్లగారి వెంకటభుజంగముగారు - ముసలాపురం

౧౧ దండు గుండేరావుగారు, కరణము - ముసలాపురం

౧౨ తిగుళ్ళ కృష్ణారెడ్డిగారు. పటేలు - ముసలాపురం

౧౩ కాకుమాను హనుమయ్యగారు, నర్సారావుపేట

౧౪ తిప్పరాజు కామేశ్వరరావుగారు, కరణం, దుగ్గిరాల

౧౫ భాస్కరరాయని వెంకట రామయ్యగారు, వంగపల్లి

౧౬ నరసింహస్వామివారు, యాదగిరి

౧౭ బీరకాయల హనుమంతరావుగారు, రాయగిరి

౧౮ పాలపర్తి గోపాలకృష్ణయ్యగారు, బెజవాడ

౧౯ బూలూరి వెంకటరత్నముగారు, వకీలు, గుంటూరు

౨౦ తుమ్మలగోటి నరసింహారావు గారు, తిరుమలగిరి.

౨౧ మెదక్ కిషన్ రావు దేశముఖు గారు, నల్లపల్లి

౨౨ నార్నెపాటి వెంకటసుబ్బారావుగారు, నర్సాపురం

౨౩ జానపాటి సుబ్రహ్మణ్యంగారు, ఆక్టింగు కరణం, పాపయపాలెము

౨౪ చిక్కరాజు వట్టుపల్లి రావుగారు, కరణం, చెలకుర్తి

౨౫ కవులూరి నరసింహారావుగారు, ఈలపోలు

౨౬ గోటేటి వేణుగోపాలరావుగారు, పోలీసుసబిన్స్పెక్టరు, ప్రత్తిపాడు

౨౭ నడింపల్లి నరసింహారావుగారు, రిజిష్ట్రారాఫీసు గ్లార్కు, క్రోసూరు

౨౮ రాచకొండ వెంకటరామయ్యగారు, యెనమదల

౨౯ నారపరాజు వెంకటలక్ష్మీనరసింహారావు దేశముఖుగారు - తమ్మవరం

౩౦ కష్ణంతు సుబ్బారావుగారు - పోలీసుసబిన్స్పెక్టరు - పిడుగురాళ్ళ

౩౧ సుంపద చిన వెంకయ్యగారు, దండమూడి.

౩౨ శ్యామాపంతుల గోపాలరావుగారు-బందోబస్తు మొహతెమిన్-వరంగల్లు

౩౩ తిరుమలనల్లాన్ చక్రవర్తి వరదాచార్యులఅయ్యవార్లంగారు-శాతాపురం

౩౪ కన్నయ్యగారిసంగయ్యగారు-ముసలాపురం

౩౫ చక్కలం పాపయ్యగారు-ముసలాపురం

౩౬ తాళ్ళవలిమె లింగన్న మొకద్దంగారు-గడి పెద్దాపురం

౩౭ కిషన్ రావు దేశపాండ్యాగారు- తాళ్లపల్లి

౩౮ వెంకటరాజయ్య సుక్త్రేదారు, సీతారాంపురం.

౩౯ తొండకొండ లక్ష్మారెడ్డిగారు, క్షీరసాగరం.

౪౦ కొత్వాలి వెంకటేశ్వరరావుగారు, సంగెం

౪౧ గంగరాజు గోపాలకిషన్ రావు దేశముఖుగారు, పాపురం

౪౨ చివుకుల శ్రీరామశర్మగారు- నాగులుప్పలపాడు

# అభినవసరస్వతి.

పత్రికాధిపతి:— జానపాటి పట్టాభిరామశాస్త్రి.

ఇది యొకమాసపత్రిక. ఇందు వర్ణాశ్రమధర్మబోధక గ్రంథములును విమర్శనములును వ్యాసములును బ్రకటింపఁబడును. చందా సం॥ 1 కి రు 3-0-0

ఈ కార్యస్థానమున వెలకుదొరకు పుస్తకములు.

| | | | | |
|---|---|---|---|---|
| 1 | కరిణీశోద్ధారిణి [పూరె వీరభద్రకవి] ... | 0 | 4 | 0 |
| 2 | వాసంతికాపరిణయ నాటకము ... | 0 | 4 | 0 |
| 3 | కంసవధ నాటకము ... | 0 | 8 | 0 |
| 4 | చమత్కారమంజరి (సింహాద్రి వెంకటాచార్యులు) | 0 | 4 | 0 |
| 5 | విరూపాక్షపీఠగురుపరంపర ... | 0 | 2 | 0 |
| 6 | నీతిగీతలు (సుమతీశతకమునకు సంస్కృతము) ... | 0 | 2 | 0 |
| 7 | విశ్వబ్రాహ్మణశబ్దఖండనము, బ్రాహ్మణశబ్దవిచారము | 0 | 2 | 0 |
| 8 | విగ్రహారాధన ఖండనఖండనము ... | 0 | 4 | 0 |
| 9 | చిత్తూరుజిల్లాతీర్పు విమర్శనము (పత్రికాధిపతి) ... | 0 | 4 | 0 |
| 10 | సంగదోషము ... | 0 | 3 | 0 |
| 11 | పులిందావివాహము (పత్రికాధిపతి) ... | 0 | 4 | 0 |
| 12 | వత్సలనీతిశతకము ... | 0 | 1 | 0 |
| 13 | శివానందలహరి (తంగెడ రామకృష్ణకవి) ... | 0 | 4 | 0 |
| 14 | నర్సారావుపేట శతావధానము (తిరుపతివెంకటీయము) | 0 | 3 | 0 |
| 15 | పశ్యాంపుశ్యాం ... | 0 | 2 | 0 |
| 16 | పశ్యశబ్దవిచారము ... | 0 | 2 | 0 |
| 17 | పురశ్చరణము ... | 0 | 2 | 0 |
| 18 | శంతనురాజచరిత్ర ... | 0 | 14 | 0 |
| 19 | వర్ణవ్యవస్థ ... | 0 | 4 | 0 |
| 20 | స్వర్ణకారవ్యవహారము ... | 1 | 8 | 0 |
| 21 | శుద్ధాంధ్రహరిశ్చంద్ర చరిత్రము ... | 0 | 10 | 0 |
| 22 | తిరుపతివెంకటేశ్వరతత్త్వము ... | 0 | 1 | 0 |
| 23 | సూతసంహిత-ఆంధ్రము ... | 2 | 0 | 0 |
| 24 | స్కాందమహాపురాణాంతర్గతనాగరఖండము (౧ సంపుటము) | 1 | 0 | 0 |
| 25 | డిటో నాగరఖండము (౨ సంపుటము) | 1 | 8 | 0 |
| 26 | భారతీయప్రబోధము (పిశుపాటి చిదంబరశాస్త్రి) | 0 | 4 | 0 |

అభినవసరస్వతీ కార్యస్థానము,
జానపాడు, పిడుగురాళ్ళపోస్టు,
గుంటూరుజిల్లా.